# వైవతీల

చంపూ కావ్యము



సదా శ్రీ

వల్లమూడి సిద్ధయ్యాకవి.

ప్రథమ ముద్రణ
1973 జూలై

వెల రు. 2-00

పాఠకులీ సవరణలను తప్పని సరిగా గుర్తింపవలసినదిగా ప్రార్థన.

20 వ పేజీలోని సీసపద్యము నందలి మూడు నాలుగు పాదములు

* నయిదువ్రేళ్ళకు నుంగరావళి నమరింతుఁ
బన్నీరుజలమును బంపుచుందు

16 వ పేజీలోని రెండవ పద్యము లోని మూడవ పంక్తి.

* వేలః తమంబు వెన్నెలయు నేనెల
వచ్చుచు బోవుచుండుగాః

వలయు వారు ;

సదాశ్రీ
ఏ. సిద్ధయ్యకవి
బరంపేట
నర్సరావుపేట పోస్టు
గుంటూరు జిల్లా




రచయిత

రత్నా ఆర్టు ప్రింటర్స్
బ్రాడీపేట 3 వ లైను
గుంటూరు-2

# ము న్ను డి



శ్రీయుతులు ధర్మవరపు రామనాధముగారు నా కెంతో సన్నిహితులు. అంతే కాదు నా కవితామతల్లిని మొదటినుండి యత్యంతానురాగ మలరఁ బోషించుచు వచ్చినదాత. వీరు సాహిత్యప్రియులు, నేనీ గ్రంథమును వ్రాసిన తరువాత వారివద్దకు కొలఁది సహాయముకోరుటకై పోయితిని, వారప్పు డనారోగ్యముగా నుండుటవలన మాటాడుటకే కుదురలేదు. కాని కొలఁది నిముషములు గడచిన తరువాత మెల్లగా సంభాషింప మొదలిడితిమి. తరువాత నావద్దనున్న యీ దైవలీల వ్రాతప్రతిని దీసి కొన్ని పద్యములను చదువుతూ కథాసంగ్రహమును నుడివితిని. అంతయు విని సంతోషాయత్త చిత్తులై "బాగున్నదయ్యా"! అనినారు,

ఆప్రమోదాయత్త వాక్యము వారినుండి వెలువడినతోడనే నేను "కృతి భర్తృత్వము స్వీకరించండి!" అన్నాను సరే నన్నారు, సంతోషముతో నేనీ కృతిని వారికిచ్చితిని, ఇట్లు నన్నునంతోషింప జేసిన శ్రీరామనాధముగారికి భగవంతుడాయురారోగ్య భాగ్యము లొసంగుగాక,

ఈ కావ్యమునకు దయతో పీఠిక నొసఁగిన శ్రీ చదలువాడ జయరామశాస్త్రి గార్కి నా నమస్కృతులు——

ర చ యి త.

# కృతి పతి ప్రశంస

శా॥ శ్రీ కౌండిన్యస గోత్రసంజనిత సుశ్రీ వైభవోపేత సు
శ్లోకస్ఫారితమైన "ధర్మవరపుం" శోభాలయాఖ్యాబ్ధికిన్
రాకాచంద్రుఁడు నాఁబరంగె మును కారంచేడు గ్రామంబునన్
శ్రీ కంఠున్ నుతియించు భక్తియుతుఁడై శిష్టప్రమోదాత్ముఁడై
నాకాధీశయశంబు పాడుఁగొనఁగా "నారాయణా" ఖ్యుండునున్,

కం॥ క్ష్మాతలిగేహినిధర్మ
స్ఫీత మనోవర్తనమున శ్రీదేవిబలెన్
ఖ్యాతిగడించెను వానికి
సీతారామమ్మ సతిగసిద్ధిలిక్రమతన్,

శా॥ ఆదాంపత్య సురద్రుమంబునకు విద్యాసార సంపుష్టి, సం
వేదోక్తంబగు భావదృష్టిగతి సంవేష్టింపఁ, ద్వైవిధ్య స
మ్మోదాయత్త ఫలస్వరూపసుత సంభూతంబుగాఁ, గల్గెమున్
యాదోనాధ సుతాత్మనాధుఁబలెఁబెద్దై "రామనాథం"బునున్

కం॥ ఆతత్త్వ విదుని తమ్ములు
పూతాత్మ ప్రథితుఁడైన మోహనరావున్
ఖ్యాతిగనగ్రజ సముఁడౌ
సీతారామాంజనేయ శ్రీకరనాముల్.

ఉ॥ ఆ నిరతప్రసిద్ధ నియమాత్ముని గేహపరీతధర్మముల్
మానితరీతిఁ బుచ్చు హనుమాయమ నాథుని కన్నిరీతులన్
దానొకఛాయవోలె సతి ధర్మమునెంచి చరించు సద్గుణో
త్తాన నిధాన, మార్యజనతా హితలీలయు, సాధుశీలయున్.

తే॥ అట్టి సుజనసమూహగృహాధినేత
యై క్రమతఁ జంద్రశేఖరు డాత్మఁగొలుచు
భక్తియుతుఁడై, నిరంతర భావగరిమ
నవ్యగతి నొప్పు శ్రీరామ నాదమరయ,

సీ॥ దేశీయ విద్యల నాశించి మదిఁ బెంచి
చదివె బాల్యంబున శ్రద్ధతోడ
ఆంగ్ల విద్యనుగూడ నభ్యసించి ముదాన
నాపైననార్జించె "న్యాయవాది
పట్టా" బుధుల్ మెచ్చఁ బరఁగె "నరసరావు
పేట" లోనివసించి చాటిమెఱయఁ
గేసులగెలిపించు కీర్తినందటి కన్న
మిన్నగాఁదా నొందెసన్నుతులను

తే॥ దేశసేవకు హితులతోఁ దేజరిల్లె
శౌర్య ధైర్యాలతో జన సంఘమందు
ప్రముఖుఁడై పెక్కురంగాలఁబాలుగొనియె
భయమునకె వానిపేర్వినృ భయముమిన్న.

కం॥ మిన్న సుయోగ్యులఁ గొల్చుట,
నన్నునుడిన్ నిల్పుకొనఁగ. నన్నడపడిఁదా
నెన్నఁడు మరువఁడు మదిలో,
నెన్నఁడు మరువందు శివుని నెన్నుటయుమదిన్.

శా॥ బోలాశంకరుఁ గొల్చుటన్ గలిగెనేమోగాని సద్దయా
శీలుండీతఁ, డధర్మవారణమునన్ శ్రీకంఠచైతన్యుఁ, డే
లీలన్జూచిన దైవలీలఁ గొననౌ లీలాత్ముఁ డట్లౌట, నీ
లీలన్ మత్కృతి నర్థి నేనును సమర్పింపంగ నుంకించితిన్.

చ॥ అనుకొన లేదునేనిది భవార్చిత మౌనని, దైవలీలయే
మనకిటు గూర్చె స్నేహ. మభిమానము మీకును మాకుఁగల్గియిం
కను మును ముందు వృద్ధిఁగొనుగాత హితంబు జగద్ధితంబుగా
మనకిల, రామనాథమ! సమంచిత చిత్తయశోభిరామమా !

ఇట్లు
—రచయిత.



# పీ ఠి క

---

కవులలోనే గాక, సామాన్య ప్రజలలోగూడ, చిరంజీవి వడ్లమూడి సిద్దయ్య వంటి నీచకుటుంబీకు డుండడేమో! అని నేననుకుంటాను, నెల్లూరు మండలమునకు తఱచుగావచ్చి, వదాన్యులైన రెడ్డిదొరల నాశ్రయించి, వారివారి దయాలభ్యములతో లభించిన విత్తముతో కుటుంబ పోషణమును, సంతాన విద్యాభివృద్ధియు పొందుచున్నవాడీ కవి, ఈయనకు "వినయ సుందరుడు" అని మా నెల్లూరు నగరాభిజ్ఞులిచ్చినవ్యక్తి పరమైన బిరుదు, సహృదయులైన పండితులందును కవులయందును అమితభక్తిభావము కల వాడీ సిద్ధకవి.

నవ్యాంధ్రభోజ బిరుదాంకితులు కీర్తిశేషులు శ్రీ బెజవాడ రామ చంద్రారెడ్డి దొరవారి యనుగ్రహమునకు మిక్కిలి ప్రేమ పాత్రుడైనాడీకవి. విద్యవలన వినయము కలిగి రాణించు నేర్పుకల్గిన యీ కవి శేఖరుని రచనా కౌశల్యముగూర్చి యించుక వచించుట నాకర్తవ్యము కాబట్టి యొకమాట చెప్పుచున్నాను.

కవిత్రయము వారి తరువాతవచ్చిన ప్రబంధశైలియు, ఇటీవల తమ అవ్యాజ కవితావేశమును పరవడింపజేసి మాటుమణగిన మధురాంధ్ర కవితా సరస్వతిని మేల్కొల్పి తెలుగుభాషామతల్లికొక క్రొత్తవెలుగును గల్పించిన "శ్రీ తిరుపతి వేంకటకవుల ధారాశుద్ధి ఈ కవిరచించిన పద్యకావ్యములు తిలకించినచో దృగ్గోచరము కాకుండదు,

గద్యరచన యందును తక్కువవనివాడుకాదని చెప్పుటకు ఇటీవల ఈకవి రచించిన "సుధీర" అను చరిత్రాత్మక నవలయే సాక్ష్యము,

గద్యపద్యములందు మిక్కిలి నేర్పుగల యీకవి కొంతకాలముక్రింద తాను వ్రాసిన ''నకుల విలాసము'' అనే కావ్యమును వ్రాతప్రతిని తెచ్చి ఆమూలాగ్రముగా తన మృదు మధుర కంఠముతో వినిపింపగా వినిసంతోషించాను, ఆకావ్యానికే," పీఠిక వ్రాయండీ!" అని అడిగినాడు, కాని నా ఆరోగ్యం సరిలేనందున ఆయనకోర్కెను తీర్చలేక పోయాను, అందుకు నేను చాల విచారించానుగూడ. ఇప్పుడీ ''దైవలీల'' కావ్యమునుపంపి పీఠికను వ్రాయమని కోరడంనాకెంతో ముదావహమైనది, కావ్యాన్ని మొదటినుండి చివరివరకు చదివాను, చాల సంతోషించాను. ఆసక్తితో నాకుతోచిన నాలుగు మాటలతో పీఠికను వ్రాయడానికి సిద్ధపడినాను, ఈ కావ్యములోని కథ ప్రఖ్యాతము కాదనుకున్నాను, ఇది కేవలము కవి సృష్టించినదేనని నమ్ముచున్నాను. ఏమైనా నాకు మాత్రమీ కథ ఎన్నడూ విననిది కననిది,

"గోదావరితీరాన దంతవరం అనే నగరం, ఆనగర పాలకుడు మహా కళింగుడనేరాజు. ఆరాజు ఆస్థానంలో చాలమంది పండితులు కవులుండేవారు, వారిలో దేవవ్రతుడు, విజయదత్తుడు, అనేవా రున్నారు. వారిద్దరా రాజు దయతో లభించిన ధనంతో విద్యాప్రవీణులైన పండితులేకాక రసపూరిత గ్రంధరచనా కౌశల్యముగల కవులుకూడ. వారిద్దరి నుద్దేశించి ఒకనాడు రాజు ఇలా ప్రశ్నించాడు. ఓబాలపండితులారా! యీ జగత్తు ఎవరిస్వాధీనమున నడచుచున్నదో వివరించుడు? అని,

అందుకు సమాధానం దేవవ్రతుడు, దైవాధీనం జగత్సర్వం. అని చెప్పాడు, పండితులు ప్రభువు సంతోషించారు. కాని తోడి బాల పండితుడు విజయ దత్తుడా దేవవ్రతు డిచ్చిన సమాధానము సరికాదనియు రాజాధీనం జగత్సర్వం" అని గట్టిగా వాదించి రాజును మెప్పించాడు, రాజు మెచ్చిన విషయం కాబట్టి పండితులు కాదనలేక మౌనంగా గూడ ఉండకుండ కరతాళధ్వానాల నలరించి దత్తుడ్ని శ్లాఘించారు, రాజు నిర్దాక్షిణ్యంగా దేవ

వ్రతుడ్ని సభనుండి బహిష్కరించాడు, అంతటితో దేవవ్రతునకు రాజాశ్రయం తొలగించి. ఇంట్లోతల్లి, భార్య పోరుపెట్టారు రాజు నాశ్రయించి క్షమాపణచెప్పుకోమని. కాని దైవంమీద అచంచల విశ్వాసంకల యామహాభిక్షుడు తప్పక దైవం తనను రక్షిస్తాడని తాను పల్కినది సత్యమనిచెప్పి తల్లిని ఓదారుస్తాడు. కాని భార్యను మాత్రము తృప్తిలేక పోతాడు ప్రయత్నించి కూడ, పిల్లనిచ్చిన మామ దేవవ్రతుడ్ని మెచ్చుకొని కొంత ధనం తీసికోమని అల్లునికీయబోతాడు. కాని అది అధర్మమని తీసికోడు దేవవ్రతుడు. తరువాత చాలకాలం బిచ్చమెత్తిబ్రతుకుతూ అనేక పరీక్షలకు గుఱై సచ్ఛీలం రక్షించు కుంటాడు, ఇలాబాధలు పడుతున్న దేవవ్రతుడి విషయం విని రాజు ఆనందాబ్ధిలో మునిగిపోతాడు, ఇంకా బాధపడాలని దేవవ్రతుడ్ని గుఱించి అనుకొని విజయదత్తుడ్నిబాగా భాగ్యవంతుడ్ని చేయాలను కున్నాడు రాజు. సంక్రాంతి పండుగ సమీపించింది. భోగినాడు కూష్మాండ దానంచేశాడు విజయదత్తుడికి రాజు, ఆ ఫలాదానంచేస్తూ ఇది నీవంశీయులకు శాశ్వతసుఖోపేత మంటాడు. కాని విజయదత్తునకు ఆశించినంతఫలం అందలేదని నీరసం కలిగించిందా ఫలదానం. పెదవివిరిచాడు. సభనుండి కదలివెళ్తూ ఒక్క వర్తకుడికి విక్రయిస్తాడు ఫలాన్ని. ఆవర్తకుడా ఫలాన్ని దైవానికి నివేదించి తన్నివేదిత కూష్మాండమును సాధూత్తమునకు దానమిస్తే మంచిదని తలచి వీధివాకిలికివచ్చి నిలుస్తాడు. దేవవ్రతుడగుపించా డాసమయానికి. ఆ వర్తకుడు ప్రియమార దేవవ్రతునకు సమర్పిస్తాడా కూష్మాండాన్ని. యథాప్రకారంగా భార్యకిస్తాడుతెచ్చి, భార్య ఆ కూష్మాండాన్ని విసువుతో గోడకు కొడుతుంది. కొట్టివదే తడవుగా ఆఫలం పగిలి అనేక రత్నమణి జాల పూరితధన వ్రాతమా యిల్లంతా అలముకొన్నది, అతని భార్యకు శరీరం కంపించింది. కండ్లు జిగేలు మన్నాయి. మతిపోయినంత పనైంది. అత్తకు చూపించింది, ఆమె మూర్ఛ పడిపోయింది. పెరట్లో స్నానం చేస్తున్న భర్తతో చెప్పింది. వచ్చి చూచాడు దేవవ్రతుడు, ఇది దైవప్రసాదితమని

చెప్పి భార్యను మెప్పించాడు. భార్య అతని పాదములమీద వ్రాలి పూర్వం తాను చేసిన తప్పుని క్షమింపమంది, తల్లి లేచి మెచ్చుకొంది. కొడుకు విశ్వాసాన్ని శ్లాఘించింది. తరువాత రాజసభలో ఈ విషయం యథాతథంగా బయటపడింది, రాజు, పండితులు విభ్రాంతి నొందారు. దేవవ్రతుడ్ని కొనియాడారు. రాజు తన ఆస్థానంలో పురల స్థానం కల్పించి ఉపవిష్టితుని గమ్మన్నాడు దేవవ్రతుడ్ని. అది విజయదత్తునకేగాని తనకుగాదని చెప్పిరాజు ననుమతి దీసికొని ప్రజలమన్ననలతో తాను నమ్మిన సత్యస్ఫురణమును జగత్తుకంతా తెలియపఱచాలనే కోర్కెతో దైవ కృపాలభ్యధనాన్నికూడా తల్లికిచ్చి, జోగియై బయలుదేరాడు. అదియానగరానికి ఎనలేని కీర్తిని ప్రసాదించినట్లు ఎల్లవారికి అనిపిస్తుంది"

ఇదీ ఇందలి కథాక్రమము,

ఈ కథను రెండశ్వాసాలుగా విభజించి యీ కవి అమృతధారా వాహిని వంటి తనకవితా మృదు శైలితో రమణీయోపమానములతో తీర్చిదిద్ది తెలుఁగులకందించి ధన్యుఁడైనాడు, ఆత్మ విశ్వాసమే దైవము అని యీ కథలోని భావము, ఆత్మ విశ్వాసములేని వారెంతగా భగవంతుని ధ్యానించినను ఎంతటి పాండిత్యము కలవారైనను ప్రయోజన ముండదు,

ఈ కథకు నాయకుడైన దేవవ్రతుడు మహాదైవభక్తిపరుడే కాని యెప్పుడు దైవప్రార్థనచేసినట్లు ఈ కావ్యమున కనుపించదు. కాని మహాభక్తుడు. ఇందుకు తార్కాణం-తల్లి, భార్య, "రాజౌసంగనిచోఁ బొయ్ రాఁజఁబోదె''?(1) అని విచారించినప్పుడు అతడు చెప్పిన సందేశ మేమో చూడండి.

సీ॥ తెలిదమ్మి విరికన్నె సలరించి నిత్యంబు
మధుపాళి కిడుచుండు మధురరసము

గమ్యగోచర మింతగాక శిలవసించు
కప్పకేతప్పక కడుపునింపు
ఎదురుబోదియ నుండు చీదురుచీమలనెల్ల
సాకునే ప్రొద్దును నూకలిడుచు
వివిధఫలంబుల వేడ్కఁ దాసృజియించి
పక్షితతికినిడుఁ బ్రస్తులుడుఁగ

తే॥ నట్టిదైవంబు తనభక్తి నలరునట్టి
మనలఁ బోషింప మఱచునే మనమునందు
విశ్వసంసారి యతనిలో వెలయు నెపుడు
దయయు దాక్షిణ్యమనెడి సద్ధనము తల్లి !

ఇది అతడు నిక్కచ్చిగా నమ్మినభావం. ఇకనందుకు తిరుగులేదు. అంతగా నమ్మినవానికి వేరే ప్రార్థనతో పనేముంటుంది? విశ్వాసమే దైవం అందుకే యీకవివర్యుడు విశ్వాస విశేషమునుగూర్చి

కం॥ విశ్వాసమె ఘనదైవము
విశ్వాసమె సర్వశక్తి వెలయించుధరన్
విశ్వాసహీనుడగువాఁ
డీశ్వర యంశంబులేని హీనుడగుఁజుమీ !

అని, ఘంటాపథముగా జెప్పినాడు. దేవవ్రతునకు ప్రత్యర్థిగా రూపొందిన విజయదత్తుడు రాజాధీనమ్ జగత్సర్వ మన్నంతమాత్రాన అతడు ప్రాజ్ఞుడు కాడనియు కవినిర్వచించినట్లు కనిపించుటలేదు. కాని తాను పలికినమాటయందు విశ్వాసము కలిగినవాడై నచో రాజు ఇచ్చిన గుమ్మడికాయను పదిలంగా మహాప్రసాదంగా భావించి యింటికి జేర్చేవాడు కాని మధ్యలో కొద్ది ధనానికి విక్రయించే వాడు కాదుగదా!, అదే యీకవి నిరూపించిన సత్యము. అదేమనిన :

కం॥ నరునైనను హరినైనను
నరవరునైనను నిజంబు నరుడొక విధమున్
బొరయగ నమ్మిన నదియే
సిరులిచ్చును గీర్తి నిచ్చు సిద్ధమురాజా !

అని. భారతములోని కర్ణపాత్ర యిందుకెంతైనా నిదర్శనము. తాను నమ్మిన దుర్యోధనుని ఎట్టి పరిస్థితులలోగూడ వదలక నిలిచాడు, కడకు ప్రాణాలనుసైతం కోల్పోయినాడు, కాని నమ్మికను వదలలేదు. అదే యీ నాటికి ప్రతిభారతీయునకు కర్ణునిమీద ప్రేమాభిమానాలు కలిగిఉండడానికి కారణము. అలాగే దేవవ్రతుడు సభలో పలికిన దైవాధీనం జగత్సర్వం అన్నమాటను మరువకుండా ఎన్నికష్టాలు వచ్చినా నిలబడ్డాడు,

కాబట్టే దైవంకూడా సిద్ధంగాఉండి అతని విశ్వాసాన్ని నిజంచేసి ఊరు కున్నాడు. అలాదైవం ఎప్పుడైతే తాను నమ్మిన భావాన్ని యాదార్థ్యంగా రూపొందించాడో భక్తుడైన దేవవ్రతు డింకొక్క మెట్టెక్కాడు. ఏమిటా మెట్టు? తాను ఏభావాన్నైతే నమ్మి ధన్యుడైనాడో ఆ సత్యభావాన్నిలోకానికి చాటేందుకు సిద్ధంగావడం. దాన్నే గురుభావం అంటారు. గురుభావం అనగా బలమైన తత్త్వంఅని అర్థం. బలం సర్వజీవులకు అవసరమే. కాబట్టి సత్యం తెలియక అనేక బాధలు పడుతున్న బలహీనులైన మానవులకు తాను తన ధ్యేయాన్ని ప్రబోధించేందుకు నడుం కట్టాడు, దైవకృపతోలభ్యమైన రాజ ధనాన్ని సైతం తృణంగా భావించి వదలి వేశాడు. ఈ తత్త్వార్థం ఈ కథా నాయకుని ద్వారా మనకందించిన యీ సిద్దయ్య నిజంగా ఏసిద్ధుడు. ఈ కథను వ్రాయుటనుబట్టి యీయన మనస్సును మనము కొలుచుకొన వచ్చును,

రాజు ఆస్థానపండితుడవుగా నావద్దనుండుమని అడిగినప్పుడు దేవ వ్రతుడిచ్చిన సమాధానం చూడండి.

ఆ॥ వలదు రాజ! నాకు వదలిన స్థానంబు
దత్తునకె లభింపఁ దగదద్ది
వాని కిడుటు నాదు వాంఛితం బయ్యది
దోషిగా డతండు భూషితుండె.

శా॥ తానారీతిని సన్నెదిర్పనెడ నాతత్త్వంబు దైవంబుపై
జ్ఞానస్ఫూర్తి నిలంబడన్ జనక సుజ్ఞానంబు వోనాడగా
నౌనేమో ? యెఱుఁగన్ దరంబె? కనుకన్ హర్షంబు నాకిట్లుగాఁ
దానేకారణమై నుతింపఁదగు బోద్ధస్ఫూర్తిఁగల్గించెగా ?

ఉ॥ కావున వానిస్థానమును గౌరవలీల నొసంగ నాకునున్
భావము రంజిలున్, దలఁపవద్దు ననున్ వ్యతిరేకిగా భవ
ద్భావమునందు, నేనిచటఁ దద్దయు నుండుటకూడ దన్ననో
భూవర! మిమ్ముఁగాదనుట బొత్తిగఁగాదు వినుండు మన్మతిన్.

ఉ॥ పోయెదజోగినై ప్రజలఁబోడిమిఁ గూర్చెడి బోధసేయఁగా
హాయినొసంగు సత్యము రవంతయెఱుంగని వారినెల్ల నా
ధ్యేయము నమ్మి కొల్చునటుఁ దెల్పెద జీవితమున్నదాఁక నీ
మాయజగమ్ము నందదియె మార్గముగాఁ దలపోసితిన్ నృపా !

ఇది యెంతయౌదార్య స్ఫూర్తిగల సమాధానమో ప్రాజ్ఞులైన పాఠకులు గ్రహింతురుగాక. ఇంకను అనేకములైన నీతులను ఆయా పాత్రల నుండి మనకు ప్రబోధించినాడీ కవిశేఖరుడు.

దేవవ్రతుని భార్య భర్త రాజ తిరస్కృతిని పొందినందువల్ల వచ్చిన కష్టాలనోర్చుకోలేక పోరు పెట్టుచున్నప్పుడు వినిన యిరుగింటి యిల్లాలు చెప్పినబోధ యెంతయు కావ్యమునకు శోభను ప్రసాదించినది. తప్పక ప్రతి

స్త్రీ చదివితీరాలి. అంతేగాక దేవవ్రతుని మామ అల్లునిపట్ల చూపిన గౌరవాభిమానాలు సరిక్రొత్తపోకడలతో పాఠకుల కాశ్చర్యం కలిగిస్తాయి చూడండి. అలాగే యింకా ఎన్నోఎన్నెన్నో మంచిమాట లిందున్నాయి.

ఈ కవి సందర్భాను కూలంగా వచించిన కొన్ని సూక్తులెంత మనోహరంగా ఉన్నాయో చూడండి.

"కలిమితో గొప్పతనమును గొలుచునట్టి
వారి చర్యలు కేవల వక్రతములు."
"మలమూత్రంబుల కుండలో బొదిగె ధర్మంబన్న సద్భావమున్"
"అత్మవంచకు నడవడియడుగవలెన ?"
"పరాత్పరులీలల్ కనశక్యమే ? ఎవరికే తాత్పర్యముల్ గూర్చునో?

ఈ రీతిగా సూక్తులుండి యీ కావ్యకన్యకు శోభను చేకూర్చాయి. చదివి గ్రహించండి ముద్రణ దోషములు కొన్ని అక్కడక్కడ కనుపించుచున్నవి. సవరించుకొనుట ముఖ్యము. ఈ కావ్యకన్యను సంకితము గొన్న శ్రీ ధర్మవరపు రామనాథముగారు కడు ధన్యులు. ఆచంద్రతారార్కము నిలుచునట్టి యీకృతిని గొనుటచే వారు అల భోజ, శ్రీకృష్ణదేవరాయాదుల లెక్కలోనికి వచ్చి చరితార్థులైనారనిన అతిశయోక్తికాదని నా విశ్వాసము. సిద్దయ్యకవి యింకను నిట్టి కావ్యములనేకము వ్రాసి యాంధ్ర కవితామతల్లి యశస్సును బెంచుగాక, భగవంతుడీ కృతికర్తకు కృతిభర్తకు ఆయురారోగ్య మహాభాగ్యములిచ్చి కాపాడుగాక.

17-7-73
నెల్లూరు.

ఇట్లు, బుధజనవిధేయుడు
సాహిత్య శిరోమణి
చదలువాడ జయరామశాస్త్రి.



కృతిస్వామి

శ్రీ ధర్మవరపు రామనాథంగారు, అడ్వకేటు

తే॥ గీ॥ ధర్మవరపు వంశాబ్ధి సుధాకరుండు
రామనాథము మత్కృతి రాణగదుర
వెలుగులోనికిఁ దెచ్చెను వేడ్కఁగదుర
అంకితం బిచ్చితిని నేను నర్థిమెఱయ.

—రచయిత

# దైవలీల

## ప్రథమాశ్వాసము

మ॥ మును గోదావరి తీరమందు సుజనామోద ప్రభూతంబునై
కనులంబండువుసేయు సత్కళల సంఘ ప్రాభవోపేతమై
యనఘాకార సమంచిత ప్రథిత కామాక్షీ మహాదేవి గో
పనమై, "దంతవరంబు" భాసిలు సురావాస భ్రమన్ గొల్పుచున్. 1

చ॥ నియమము, నిష్ఠ, సంతత వినిశ్చల చిత్తపరీత సంపదన్
జయము దలిర్చుచుండ, నరజన్మ సుయోగ్యతనొందు సత్కళో
దయమలరించు పండీతులు, ధార్మికు, లాపురలక్ష్మివాసికిన్
భయమును బాపుచుందురొగిఁ బావనశీల విలోలజాలురై. 2

ఆ॥ చిత్రలేఖనంబు శ్రీకరంబగుకైత
లలరుసొంపు మెఱయ నల్లునట్టి
సాధుయువకులందుఁ జాలమందిగలారు
దేవలోక బుధుల తేజమెనసి, 3

ఉ॥ వారలుగాక తత్పురముపైఁ గదనం బొనరింపవచ్చునే
ధారుణీనాధునైనఁ దమ ధాత్రివిభుం డని సేసిగెల్వఁగాఁ
దారసిలంగనీక, భుజదర్పమునన్ రణభూమినిల్చి త
ద్వైరిని బారఁద్రోలు భటవర్గము మస్తుగనుండె నా యెడన్, 4

తే॥ అట్టి భటకోటి విద్వాంసు లలరునట్టి
తత్పురంబును నేలు నుదారబుద్ధి
తనరఁగ మహాకళింగుఁడన్ ధాత్రిపతుఁడు
సుజన సన్నుతు లొప్పారుచొప్పు మెఱయ,

తే॥ కవితయన్నను నాట్యంబుగాన మన్నఁ
జిత్రలేఖన మన్నఁ దాఁ జిత్తమందు
ప్రేముడిన్ జూచు నా ప్రభుఁడోమికతన
నిర్వురొప్పిరి కవులు గణింప బుధులు,

వ॥ వారలు 'విజయదత్తుండు, దేవప్రతుం'డనువారు,

తే॥ బాల్యమాదిగ వారు భూపాలుధనము
సాయమై పెంచ విద్యను శ్రద్ధతోడ
నేర్చి కవితను వ్రాయఁగా నేర్చినారు
విమలభావాలనొప్పు సంవిదులు మెచ్చ.

తే॥ వారి నిర్వుర రాజు సద్భావమలర
బాల్యమాదిగఁ జదివించి పండితులను
జేసియుండిన కతమున స్నిగ్ధమోద
చిత్తుఁడై యొక్కనాఁడు ప్రశ్నించె సభను

తే॥ బాల పండితులార ! మీ భావశుద్ధి
యెట్టిదో నేఁడు తెలియఁగా నేనుగోరి
యడుగుచుంటిని జగము సమంచితముగ
నెవని స్వాధీనమైయొప్పు నిట్లు చెపుడు ?

కం॥ అనిముందుగ దేవవ్రతుఁ
గని, నీవె వచింపఁగలవుగావున సభ్యుల్
ఘనరఁగ నుడువుము సత్యం
బనినన్ ధరణీశుఁగాంచి యనియె వ్రతుండున్, 11

చ॥ నరవర యోలగంబున ఘనప్రథితాత్మ వివేచనాపరుల్
పరఁగుచు నుండ, మీరలిటు పట్టుబట్టి మదీయవాణిచే
నరయఁగ నెంచినారలిది యబ్బురమౌ విషయంబె, యైననున్,
హరికృపఁ దెల్పెడన్ దెలిసినంత వినుండు మదీయ చిత్తమున్. 12

కం॥ భావింపఁగ మీ ప్రశ్నకు
నే వచియించునది నాకు నిజమనితోఁచున్
దై వాధీన మ్మీజగ
మే విధమున జూచుకొనుఁడు నెవ్వరెకానీ. 13

కం॥ అనియటు దేవవ్రతుఁడన
విని సభ్యులు "సాధు" "సాధు" విమలాత్ముండీ
ఘనుఁడని మెచ్చుచుఁ బలుకఁగఁ
గనలెను[2] దత్తుని మనంబు క్రౌర్యంబుబుకన్। 14

సీ॥ వ్రతుఁడాడినది సత్యవచనమే యైనను
నెల్లయు మెచ్చుట నీర్ష్యనొందెఁ
దివిరి దత్తుండట్లు తీవ్రత నొప్పుచు
వాయసంబు పికము తీయనైన

పలుకుఁబల్కుట విని గలఁతఁ జెందినరీతిఁ
బండితుండై నను పరమహితము
విని మోదమందెడి విధమెడఁబాయును
నోర్వలేని తనమె యున్నయెడల

ఆ॥ దానిగెలువకున్న న్యూనతనొందుట
నిక్కవంబు కడకు, నేర్పుఁగలిగి
దాని బాపికొన్న ధన్యుఁడౌ నరుడెన్న
నిహము పరమునందు నెనయుకీర్తి

శా॥ ఆ దేవవ్రతుఁడాడినట్టి నుడిసత్యంబౌట నా సత్సభన్
మోదంబొందెడి మేటి పండితుల నా భూపాలునింగాంచి, యి
ట్లా దత్తుండనెఁ గాదు సత్యమిది రాజాధీన మీ సర్వ, మీ
వాదం బెవ్వరుగాదనంగలరౌ నే వాదింతు నవ్వారితో.

మ॥ అనినన్ భూపతి నవ్యమోద వదనం బారన్గనన్ వచ్చుటన్
గని, యీమాట నృపాల చిత్తమునకున్ గల్గించె మోదంబు, కా
వున గాలంబును బట్టిపోవుటయు దివ్యల్ సేయఁగా దగ్గ దం
చనిగాదే బుధులాడుచుందు"రని లోనాలోచనల్ చొప్పిలన్.

కం॥ తనరన్ గరతాళంబులు
నొనరించిరి ప్రభువు వినఁగ నోహో! యనుచున్
గనులన్ మోదముఁ జూపిరి
విని యా తీరులనువ్రతుఁడు విస్మయమొందెన్.

ఉ॥ అంతకుముందు రాజునకు నన్నివిధంబుల మేటిగా మదిన్
గాంతిలు నా వ్రతుండపుడు కల్మషచిత్తునివోలెఁదోఁచె, సి
ద్ధాంతులు దారిఁదప్పునెడ ధారుణి వక్రపథానువర్తులై
మింతురు యోచనాక్రమము మిన్నను మన్ననుగాన కెఱల్లన్. 19

తే॥ ప్రేమపాత్రునిగా నెంచి పెంచు రాజు
స్వార్థపర కీర్తిఁగోరి యా సత్యవంతు
వ్రతుని దెలియఁగా లేదయ్యె, వక్రదృష్టిఁ
గల్పనముసేసె దత్తు వాక్యమ్ములట్లు. 20

వ॥ అట్లు పరబుద్ధిపరుండైన యా కళింగరాజు సభ్యు లెల్లఱు విన
నిట్లనియె. 21

తే॥ సత్యము వచించె దత్తుండు సమయమునకుఁ
దగినరీతిని, వ్రతుఁడేమొ ధాత్రిపతుల
లెక్కసేయక పల్కెఁదుర్లీలఁ బోనిపి
తిన్నయింటిని గాల్చెడి తీరుదోఁచ. 22

వ॥ అని దేవవ్రతుని విధంబును వక్రతమమని యెంచిన వాఁడగు
టచే నబ్బురంబాననమున నసియాడ నెల్లఱువిన నిట్లనియె. 23

ఉ॥ విద్దెను నేర్చునాఁడు తగు విత్తమొసంగితి, మొన్న పెండ్లికిఁ
బెద్దగ నిచ్చితిన్, గృహముపేడ్క నొసంగితి, నింతచేసినఁ
బెద్దఱికంబు మాకిడఁడు ప్రేముడి దైవముపై నజూపెఁ దా,
నద్దిర! మాటనేర్చునగదా? మముబోటులనొంతు రిట్టిడుల్. 24

వ॥ అని యించుక క్రోధస్ఫూర్తి మెఱయదేవవ్రతుఁ గాంచి. 25

తే॥ బాగుగా సత్యమెఱింగి సంభాషణంబుఁ
జలుపఁ లేకున్న హీనరగలుగు నంచు
నేలిదంబుగఁ బలికిన నింపుకేని
వెఱవకే వ్రతుండనెను పృథ్వీశుతోడ. 26

తే॥ ఏను వచియించినది సత్యమే, నృపాల!
యిచటఁగానందు కేనేమి యెదనుగ్రుంగ?
గాల మొకరీతిఁ గడచునా? కావలెనన?
నెప్పు డేలీలఁ గూర్చునో యెరికెఱుక? 27

తే॥ దేవ ప్రేరేపణములేని దినమునందు
మీరు మాకొక యింతయు మేలుసేయ
లేరు, తలఁచియు దివ్యులే లేశమైన
యోగ్యకార్యంబుఁదీర్పలే రుర్వినాథ! 28

ఉ॥ నమ్మినదాని నేను నరనాథులు మీరను భీతి వీడి స
త్యమ్ముగఁ జెప్పినాడ, నిది తత్పరతన్ నిజమంచెఱుంగరే?
మిమ్ముల మీరు గొప్పగ భ్రమించుటగా కిది వాస్తవంబె? నే
నమ్మినదే నిజం బిచట నచ్చనిదానికి నాకు లోపమే? 29

తే॥ అనిన నీకఁబొమ్ము మింటికి నడుగు నిడకు
మిందు, పొరపాటునైనను బొంపరాదు
నీ మనోగతి మారిన మేమె పిలచి
సత్కరించెద మందాఁక స్థానమిమ్ము. 30

వ॥ నావుడు, మహాప్రసాదంబని సభవీడి యింటికిఁజని యథావిధినిగడపి
మరునాఁటి ప్రభాతంబున లేచి కల్యంబులఁ దీర్చికొని, దైవపూజా
నంతరంబున గొలువునకుఁబోక నిశ్చింత నున్నవానింగాంచితల్లియు
భార్యయైన "ప్రసూనయు" సభకేలఁబోవైతి వనిన జరిగిన యుదం
తంబెల్లజెప్పి మిన్నకుండిన వానింగని తల్లి యిట్లనియె 31

తే॥ ఎంత తొందఱపడినావు ! చింతవొడమ
నీక, యింతటిదాఁకను సాకె మనల
దాత, భూనేత, యే సత్యధర్మమైన
దాఁచిపలికిన వచ్చెడి తప్పదేమి ? 32

వ॥ అనునంతలో వానిపత్ని యిట్లనియె 33

తే॥ సమయమునుబట్టి సత్యంబు సభలయందు
దాఁచుటయు నేర్పెయౌ, దాని దలఁపకున్న
బ్రతుకుగడచుట కష్టంబు, పండితుడవె
యింత యెఱుఁగవ? లోకిక మింతవరకు ? 34

వ॥ అనినకోడలి మాటలందలి పరుషంబును గ్రహించి వారించుచు
వానితల్లి మరలనిట్లనియె, 35

తే॥ ఇంకపయినిల్లు గడచుట యెట్టులొగద ?
రా జొసంగనిచో, బోయి రాఁజఁ బోవె
మనకు !, నాయనా! నేఁబోయి మనుజవిభుని
సైపుమని కోరెదను నీకుఁ బ్రాపునిడగ 36

వ॥ నిజముగా నారాజు మనకెంతయు మేలుచేసె, ఎట్లనిన : 37

ఉ॥ విత్తమొసంగె నన్నిటికి, వీడున నీసరిసాటివారిలో
నుత్తముఁడన్నఖ్యాతికిని నొప్పఁగనిచ్చె సభాస్థలంబునన్
సొత్తుగఁబీరమున్, బయికిసొంపుగ నీవునుదత్తుపోలికన్
మెత్తఁగఁబల్కనేమి గతిమీరిన వాఁడవు నౌదునాయనా ? 38

ఉ॥ ఇంతకుదత్తుఁడీర్ష్యగొని యీగతిఁగూర్చెనుగాని లేనిచోఁ
బంతముఁబూనునా ప్రభువు ? పండితుఁడయ్యును దత్తుఁడిట్లు నీ
సంతసలీలఁగ్రుంగవరుసన్ గమకింపకెపల్కనాడ ?, వే
దాంతులులేరె యందు ! వినిహర్షమునొందిర ? యెంతచిత్రమో ?

ఉ॥ మిత్రత నొప్పుస్నేహితునిమేలు నశింపఁగఁజేయు మాటలన్
ధాత్రి నిరక్షరాస్యుఁడును దత్పరతన్ బలుకాడఁబోడె, యీ
మాత్రమెఱుంగఁడా?, నిరతమాన్యబుధాళి హితోపదేశ స
చ్ఛాత్రతనొప్పు నట్టి సువిచారుఁడునై విజయుండు బాపురే ! 40

వ॥ అని విస్మయావేదనా పూరితహృదయయై, రాజుపెట్టుకున్నఁ బ్రస్తు
లతో మ్రగ్గవలసివచ్చునే ! యనివిలపించు తల్లినివారించుచు దేవ
వ్రతుండిట్లనియె. 41

తే॥ భయమదేటికితల్లి ! భూపాలుఁడిడిన
దాననేజీవులకుఁగల్గు "దారక" మను
మాట మరువుము, సత్యంబు మరుగునబడు
నట్టినమ్మిక కుదిరిన నవనినిజంబు 42

వ॥ అని తల్లినోదార్చుచు మఱియును నిట్లనియె. 43

సీ॥ తెలిదమ్మివిరికన్నె నలరించి నిత్యంబు
మధుపాళికిడుచుండు మధురరసము
గమ్యగోచరమింతగాక శిలవసించు
కప్పకేతప్పక కడుపునింపు
ఎదురుబోదియనుండు చిదురు చీమలనెల్ల
సాకు నేప్పొద్దును నూకలిడుచు
వివిధఫలంబులవేడ్కఁ దా సృజియించి
పక్షిజాతికినిడు ప్రస్తుతుడుఁగ

తే॥ నట్టిదైవంబు తనభక్తినలరు నట్టి
మనలఁబోషింప మఱచునే మనమునందు
విశ్వసంసారి యతనిలో వెలయునెపుడు
దయయు దాక్షిణ్యమనెడి సద్ధనముతల్లి! 44

కం॥ అనినన్ బుత్త్రిని భావము
జననికినచ్చినది గాథ సద్భక్తియుతం
బనికానీ పత్నిచిరా
కున నవలకుఁబోయినది ప్రకోపక్రుధయై 45

వ॥ అట్లుక్రోధయైపోయిన వానిపత్నినాఁడు మొదలుకొని యకారణ కలహకారిణియై, భర్తమాటను ననురాగంబుమెయి నొప్పక, అత్తమాట నెత్తటిఁజిత్తంబున లెక్కింపక, నిరంతరంబును విసువునమందుచుండు, అట్టియానెలంత వృత్తాంతంబు విని యొక్కనాఁడామె తండ్రి యరుదెంచి యల్లునివలన జరిగినది విని కూఁతురు ప్రవర్తనంబు నొల్లక యిట్లనియె. 48

కం॥ తగునమ్మా ! నీకీపధి
మగనియెడన్ సంచరింప, మానితమగుతీ
రొగి నెఱిఁగి వోవు టెంతయు
మగువులకున్ దగును నిట్లు మసలవలవదే !

ఉ॥ నేఁడిటు భూవిభుండు కరుణింపకపోయిన యంత నీ మగం
డోడునటమ్మ ? సత్యమెపు డుర్విజయించియె తీరునమ్మ ! నీ
వేడువరాదు, వేడ్కమెయి నింటఁ జరించుచు భావసంపదన్
బాడిమెయిన్ దలిర్చి, నిరపాయముఁ గూర్చుట లెస్స భర్తకున్. 48

తే॥ ధనము సుఖమిచ్చు, ధర్మమ్ము దప్పనట్టి
చిత్తమున్నెడ స్థిరకీర్తి సిద్ధిఁబొందు
గీర్తిపరులైన వారి సంకీలితులిల
శుభము వర్ధిల్ల నుందురు సుఖము గలిగి 49

వ॥ కావున స్త్రీ యెప్పుడును 50

చ॥ పతి మరియాదఁ గావలె, భావము, కీర్తి, సుఖంబుఁ గోరుచున్
వెతలయినన్ సహింపవలె, వేడుకఁదన్ గనువాడ ?, కాడ ?, యం
చలివ గ్రహించు టొక్కటె యధార్థము, పోషకభావుఁడైనచో
క్షితినిడుములన్ నశించి తుదక్షేమముఁ బొందు నతండు పత్నితో. 51

వ. అని పెక్కు భంగులఁ గూతునకు నీతిఁ గఱపి యోదార్చి
యల్లునితో నిట్లనియె, 52

ఉ॥ నీవు వచించినట్టిది గణింపఁగఁ దగ్గదె: యైనగాని దు
ర్భావుఁడు దత్తుఁ డీర్ష్యఁగొని పాలకుపక్షముఁ బల్కె నీపయిన్
గేవలమన్య చిత్తుఁడగు గీటునకున్ మరలించె రాజు, నో
భావితభావ! నీకు భగవంతుఁడు తోడగు గెల్పు నొందుదన్. 53

వ. అని తాను కొంత ధనం బీయ సమకట్టిన దేవవ్రతుం డిచ్చఁ
గొనక మామ కిట్లనియె. 54

చ॥ తలఁపకుఁ డన్యథా, యిది యధర్మము నాకగు. మీరు సత్కృపన్
లలన నొసంగినారు గృహరమ్యతకై యదిచాలు, నేఁడిటుల్
కలిమి నొసంగఁబూనితిరి కష్టములోఁ బడినాడనంచుఁ గే
వలమిది కాలదోషమున వచ్చిన యట్టిది పోదె లిప్తలో! 55

చ॥ శ్రమపడి యెట్టులో గృహము జక్కఁగ దిద్దుకొనంగఁ జూతు, మీ
శ్రమమున గొన్నలిబ్బిఁ గొనఁజాలను జీవనముం బొనర్ప, నే
మమునకు భిన్నమయ్యది, ప్రమాదము గూర్చు గృహస్థ ధర్మనై
జమునకు, బిచ్చమెత్తి మన జాలిన మేలగుఁగాదె? నాకిఁకన్? 56

వ, అనిన మామయు నా యల్లుని చెల్లఁబడి యెఱింగిన వాఁడగుటచే
వాని వ్రతనియమంబునకు భంగంబు ఘటిల్లనీక నిశ్చింతమెయి
నిజవాసంబున కరిగె, అనంతరంబు దేవవ్రతుం డిల్లు జరుపు
తెఱఁగు యోజించి, యే పగిదిఁదోచక, యూర బిచ్చంబునెత్తికొని
జీవింపసాగె, అట్టి యెడ వాని పత్నియగు ప్రసూన, 57

సీ॥ పరదార మెడలోని బంగారు నగఁగాంచి
నాకు లేదేయని నసుగుకొనును

పరగృహంబున బిండివంట ఘుమాయింప
నాకేది యని లోన జీఁకుఁబొందుఁ

బేరంటమునకేఁగి సారె చీరెలఁ జూచి
తనకు లేనందుకుఁ గనలుచుండుఁ

బరపండితునకైనసరస సన్మానంబు
విని భర్తలోనెంచి వెగటుగొనును

తే॥ రాను రానింటి పనులు మురబ్బినుండి
తప్పికొనుచుండు నత్తకే యొప్పగించి
"కలిమితో గొప్ప తనమును గొలుచునట్టి
వారి చర్యలు కేవల వక్రతములు". 58

కం॥ ప్రియమూర భర్త తోడుత
నయమలరన్ బలికి పత్ని న్యాయముఁ దీర్పన్
రయమొంద నేరదా సతి
భయమొరయన్ జేయు నన్ని పనులన్ గూడన్. 59

వ, అట్లు విరసంబున మండిపడుచుండు నాసతి నరసి, యొక్కనాఁడా
దేవవ్రతుండు సాదరంబున సరసఁ జేరి యేదియో పలుకఁ బోవఁ
జీదరించుచు నా ప్రసూన యిట్లనియె, 60

ఆ॥ చాలు పొందు నింక సరిగఁబాయ రాఁజదే
నేరుపలర నేఁడొ నీతిపలుక
వచ్చినారు నాకు నచ్చదు మీపని
భూమిపాలుతోడ పోరె మీకు ?  61

కం॥ దైవాధీనమె జగమను
భావంబే నిజమటంచుఁ బలుకఁగ నేలా !
భూవల్లభు దయచే భువి
జీవులు మనుచుండె ననిన జెల్లదె నిజమై,  62

చ॥ చదివిన నేమిలాభ, మొకచందమునన్ బ్రదుకంగనేర్చు చో
నది హితమౌ సమస్తమున, కయ్యదిలేక తపించుచుండి, నె
మ్మది భగవంతునమ్మినటు మాటలనాడుట యుక్తమౌనె ? నీ
వెద నెఱనమ్ము దేవుఁడిప్పుడేడి ? రవంతయు తోడురాడుగా!  63

చ॥ పిడికెడు గింజలింటఁ గనిపింపవె, యెన్నిదినంబులిట్లు నే
నిడుములువొందఁ గావలయు ?, నింతయు నిబ్బితిలేనివాఁడవై
గడపలఁ బెక్కునెక్కి యడుగన్ లభియించిన బిచ్చమెత్తు, వీ
నడకె గృహస్థుఁ డెవ్వఁడు ఘనంబుగ నెంచఁడు సంఘమందునన్  64

మ॥ నరపాలుండెద మెచ్చనౌపగిది విన్నాణంబు పెచ్చించి తా
నిరవౌపద్ధతిఁ బల్కి యా విజయుఁడే యిక్కట్టులన్ బొందె: నీ
కరయన్ వచ్చుటలేదె ? నీవును నృపున్ హర్షంబు నొందించుచో
సిరియబ్బున్ గద, యింట నీ సిలుగులున్ జేరంగరావేగదా ?  65

తే॥ ప్రస్తులఁ గృశించుచే నీకు పరువౌచూడ
సాటివారలు నవ్వుచుఁ జాటుగాను
జెప్పికొను మాటలన్ విని సిగ్గునొంది
యేడ్చుచుంటిని నా కర్మనెంచి యిట్లు. 66

చ॥ అనుచుఁ గడుంగడున్ వగచు నాలికి నాదరమొప్ప నాతఁ డి
ట్లను, వినుమా సఖీ! నిజమునందె పరాత్పరుఁడుండు, దాని వీ
డిన భగవంతుఁ డుండఁ డతఁడే యెడమైన గృహాన సంపదల్
కనపడుచుండినన్ దనివి కన్పడ దెప్పుడు బాధలుండెడిన్. 67

ఆ॥ అట్టి జీవితంబు హాయి యెట్లగు ధాత్రి!
తృప్తి, ధర్మపథము దీప్తినొంద
సత్య నిరతులగుట క్షమగల్గి నడచుట
లేని జీవితంబు హాని కరము: 68

ఆ॥ ఇది పరీక్షమనకు నింతిరో? యిట్టులే
సాధు తతికివచ్చు బాధలవని
జంకి పెరఁజరింపఁ బొంకంబు దప్పును
ధైర్యగతిని నమ్ము దైవలీల. 69

కం॥ నింగిని జుక్కల నెపుడే
మ్రింగునె గ్రహముల్ సెలంగి మేదిని వెలుఁగుల్
పొంగారఁ జేయు రవి శశు
లంగాకను దైవవిధము లంగాదనెదే! 70

ఉ॥ స త్తెమువీడ రెన్నియగచాట్లు పయింబడినన్ సుయోగ్యు, లా
యు త్తములన్ గృపన్‌గనుచునుండు( బరాత్పరు( డెంతయేని నా
చి త్తములోని నమ్మకము( జిన్నతనంబుగ జే(డు గాంచినన్
మె త్తగిలంగనీయనిది మేలగు( జూడుము దైవసత్కృపన్. 71

కం॥ అని నుడివిన నాయింతికి
మనమున రవ్వంతె దైవమన నమ్మకమే
తనరని కతమున లక్ష్యం
బును దా( బతిమాటయందు( బుచ్చదుప్రీతిన్. 72

వ. అ త్తయు నతి వాత్సల్యమున నోదార్ప( గడ(గిన కన్నుమని. 73

కం॥ నే(బోదు( బుట్టినింటికి
బాబో! యీ కాపురంబు పాడయిపోనే
నీ బాధలిట్లు వడుచున్
తో(బడియుండను జగంబు రోతది యనినన్. 74

వ. అని యంగలార్చుతటి నిరుగింటి తెఱవ యొకర్తుక వచ్చి,
" ప్రసూనా! నీకింత తెలియదెట్లు? " 75

తే॥ చూడు మమ్మా! నిజంబు నీ శుభము పెంపు
నీత( డబ్బెను భర్తగా, నీతిపరు(డు
గొప్ప విద్వాంసు( డేనా(టికో ఫలించు
వాని కష్టంబు సామాన్యమే? నెలంత? 76

ఉ॥ గుట్టు తగున్ గృహస్థులకు, కోపము కూడనెకూడ, దెంతయో
మట్టసముండఁ గావలెను మాటలఁ జేఁతల, స్త్రీకి ముఖ్యమీ
పట్టుఁదలన్ బ్రవర్తియుట, భావనసేయుము కల్మికన్ననున్
గట్టిది శీలమమ్మ! పదిఁగల్గి చరింపుము దీనినెమ్మెయిన్. 77

ఉ॥ తూలిరి వెన్నొమాటలను తొందఱయెందుకు, కష్టమెప్పుడో
తూలి సుఖంబువచ్చు, నిదితోఁచక నీవెద ఖ్రీతినొందినా,
విలసహజంబు చీఁకటియు వెన్నెలవచ్చుచుఁ బోవుచుండుటల్
మేలోనగూర్చు నొక్కటియ మేదిని ధర్మపథంబు నమ్ముచే, 78

ఆ॥ సిరులఁ బడయవచ్చుఁ జెదరిన శ్రమపడి
శీలముడిఁగి మరలఁ జెందలేము
పుడమిఁ బాసి ప్రాణమడరునే బొందిలో
మరల శీ విలువ దెలిసి మసలవమ్మ! 79

కం॥ నిబ్బర మవసర మమ్మా!
లిబ్బికినై యింతగాను లేకివడుటయా?
యెబ్బేటికము గరితల కిది
యబ్బిన దాననె ముదాన నలరుట మేలౌ, 80

వ. మాటకుఁ బుట్టినింటి కేఁగెద నందు వది యుత్తమకుల సంజాత
మైన స్త్రీయనదగిన మాటయే? వారేమి యెల్లకాలంబు నుల్లము
ఆసంగి చూతురనియా నీ భావంబు? చూడు! 81

సీ॥ మొదటి దినంబున ముద్దుగాఁ జూతురు
మరుసటి దినమున మారిపోదు
రటుపైన గ్రమముగా నాలోకనలయందు
నిర్లక్ష్యమును, విస్సు, నిలుపులేని
మాటలనాడుట, మఱికొన్ని దినములు
గడచిన నెనలేని గడుసుఁదనముఁ
జూపి యెత్తిపొడుపు లేపున బలుకుదు
రప్పటికింకను నొప్పియున్నఁ

తే॥ బదవె నీయింటి కంచును బట్టుపట్టి
యిరుగు పొరుగు వారినిబిల్చి యిమ్ముఁదెల్పి
మెల్లఁగా దారిఁ జూపింతు రెల్లవిధుల
భర్తగృహమే శరణ్యంబు పడఁతి కెపుడు 82

చ॥ అని యిరుగింటి యా తెఱవ యద్భుతమౌ హితబోధసేయఁ దా
విని మది నూరడిల్లి పిరువీఁకఁ దొఱంగి గృహంబులోఁ బనుల్
వినియమ లీలఁ జేయుచుఁ జలింపకయుండ, వ్రతుండు సంతసం
బున బురి బిచ్చమెత్తుకొన బోవుచు నుండెడివాఁడు భక్తికై 83

వ, అట్టి యవసరంబున 84

కం॥ కొందఱు రాజ తిరస్కృతి
నొందిన వాఁడనుచు నుఱక యురిమెడి వారల్
కొందఱు దయతో బిచ్చం
బందించెడివారు చాటునైనను బ్రీతిన్, 85

వ. అవ్విధంబున 86

చ॥ దినమును నూరభిక్షకయి త్రిమ్మఱు నా ప్రతురూపు రేఖలన్
గని మరువారిఁ జిక్కి యొక కాంతధనంబు నొసంగి యైననున్
బెనఁగొనసెంచి నేర్పుమెయి భిక్షకు వచ్చినవాని నిల్పి. యి
ట్లనె నొకనాఁడు మోహభరితాననయై వగలన్ వెలార్చుచున్, 87

తే॥ నిత్యమీ బిచ్చమెత్తుచు నిలుపులేని
జీవితంబును గడపెదే, దేవతలకె
నీదు రూపంబు సిద్ధింపనేర దకట !
యేల నీ యేలిదంపుఁ జరింపునీకు ? 88

ఉ॥ ఒక్కటి చెప్పుచుంటి విను మూరకనీతులువల్కఁ బోక, స్రీ
కొక్కటికూడ లోటొదవకుండ భరించెద గుట్టుగాను నా
మక్కువ దీర్పనొప్పు మభిమానము గల్గిన యింటిదాననై
చిక్కితి నీదురూపునను చిత్తవికారతనొప్పఁ జేయుటన్. 89

చ॥ స్థలమును నేనె గూర్చెదను, చక్కఁగవచ్చి మదీయమోహ వి
హ్వలతను దీర్చిపొమ్ము పెరవారికిఁ గన్పడఁబోని తీరునన్
మెలఁగఁగఁ జేయుదానను సుమీ మనపొత్తును, నమ్ము మెందునన్
వెలితియె నీకుఁ గల్గదిఁక వేడుకతప్ప నిజంబు నానుడుల్. 90

చ॥ పరునకు భార్యనంచు మది బాధను జెందెదవేమొ, యింతకున్
సరిగ మదీయనాథు సరసంబు నెరుంగను, క్రీడయందునున్
సరియగు తృప్తినొందు గతి సల్పినవాఁడునుగా డెవోపనుల్
దొరయుటఁ బోవుచుండెచట దొర్లునొయేమొ యెఱుంగనే నెటుల్. 91

చ॥ నినుగని నేనె కాదిచటి నేరుపుగత్తెలు కొందరుల్లముల్
పెనఁగొన నీదురూపము, చలించిరి కాని, రవంత యిండ్లలో
మనుజులు నుంటచే నిను సమంజసరీతిని బల్కరింతు, ర
ల్లన నుడులన్ మదిన్‌గలుగు రాగముఁ దీర్చుకొనంగ మక్కువన్, 92

ఉ॥ మా నిలయాన నత్తయును మామయు లేరిఁక నాథుఁడన్ననో
తానొకచోట నిల్వకయె ధారుణి సంచరియించు, నేమిటో
మానసమందు సంపదను మాత్రము కూర్పఁగఁ జూచుఁగాని, నా
తో నయమార నొక్కపుడు నుండఁడు కామముదీర్చు కోరికన్, 93

ఉ॥ పెండిలి చేసికొంటినను పేరొకటున్నదెగాని యెన్నడున్
దండిగ భర్తతోఁ గలిసి తాపము దీర సుఖింపనైతి, నా
గుండెకు హాయి గూడు నటుఁగూరిమిఁ జూపి దినమ్మువచ్చి, పొ
మ్మండదు హాని నీకు నిఁకనుండి దరిద్రతకూడ నుండదున్, 94

ఉ॥ వింటిని నీవు చెప్పినది పృథ్వి విభుండెదనొల్లఁ బోక యే
గెంటిన మాట, గాని యిది కీర్తికి వంచనయంచునెంచకే
కొంచెలు గోలసేతురని గ్రుంగఁక నా దు కౌఁగిలిన్ సతం
బుంటకు నొప్పుకొమ్మెటుల నుందువొ చూతువుగాని యింకపై, 95

ఉ॥ కమ్మని పాలు మీగడలు గడ్డగఁ బేర్కొని నట్టిపెర్గు, నీ
కిమ్ముగఁ బంపుచుందు, నిఁక నింటఁ దగాదయుఁ గూడనుండ బో
దమ్మక చెల్ల! యీ వయసునందు పసందుగ మెక్కి హాయి రా
గమ్ములఁ దీయుచున్ దగిన కాంత సుఖంబున దేలుటొప్పదే? 96

సీ॥ సరిగంచు పట్టు పంచలు కట్టఁబెట్టెదిఁ
గాశ్మీరు శాలువాల్ గప్పనిత్తు
నై దేండ్ల కుంగరా లమరింతు నిత్యంబు
పన్నీరు జలములన్ బంపుచుందు
అగరు నూనెలతోడి యౌదల మెఱపింతు
నవకాయ పిండివంటల నెసంగు
మంచి భోజనమును మించనీయక వేళ
మీ యింట వండఁ బంపించుచుందు.

తే॥ ఒక్క టేమిటి? రాట్సుభ నున్నవేళ
యందునున్ నీకు లేనట్టి హాయిగూర్తుఁ
గండ్లలోఁ బెట్టిపెంచెదఁ గాంతఁ దీర
నాదు మోహంబు దీర్ప మనస్సు నిడుమ.

ఆ॥ అనుచు వెంట వెంట నాడు నా కాంతను
విస్తుపోయి చూచి వేద వేద్యుఁ
డైన యా వ్రతుండు ననియెఁ గొంకకదాని
గోలతనముఁ బాపు మూలమిట్లు.

తే॥ ఇంచుమించుగ ముప్పదియేండ్లయీడు
గలిగి, కాపురమొక కొంతగడిపియున్న
గృహిణివై యీయఘంబు సాగింపఁదలఁచు
టెంత విడ్డూరమొ గ్రహియింపవైతె?

ఉ॥ పాపపుఁగార్యముల్ తొలుతబాగుగఁ దోఁచు, సుఖప్రదంబులై
యేపలరించులోన నటు లేర్పడి మానసమున్ వికారసం
తాప నిమగ్నఁగాఁజలుపుఁ దత్పరతన్ మదమత్సరప్రథా
కూపముగానొనర్చు నవె క్రూరముగా వధియించుఁబిమ్మటన్ 100

ఉ॥ అత్తయు మామలేరనుచు హాయిగ నన్యునితోఁ జరింపఁగాఁ
జిత్తమునన్దలంచెదవ? ధీయనిక్షిలోకులెటింగినంత నీ
బిత్తటి చేష్టలన్దవిడి బిట్టుగదండన సేయరొక్కొ : నీ
కెత్తటినైన గత్తియయి యీకలుషంబె హతంబుగూర్చదే : 101

ఉ॥ కామము మంచి చెడ్డలను గన్గొనజాలని గ్రుడ్డిదమ్మ : నీ
స్వామిని గౌరవించుకొను స్వాంతముఁ బెంచుము, ధాత్రిపైనదే
ప్రేమయనంగనొప్పు నది విశ్రుతకీర్తి నొసంగుదైవ, మా
రామము హృత్పవిత్రతకు రమ్యవిధాన మనంతసౌఖ్యమున్ 102

ఉ॥ నీపతి నిన్ను నొంటరిగనే విడనాడి పరాయిచోటులం
దోపికతోడ నుత్సుకముతోడ ధనార్జన సేయఁబోవుటల్
పాపపుఁ గార్యముల్ సలుపు భావము నీకడలేదటంచుఁదా
నేపున నమ్మిగాదె ? మఱి యీవిధినీ వానరింప వచ్చునే? 103

మ॥ ఎవరున్ జూడరటంచు నెంచకుము నీ, వీ భూమియున్ గాలియున్
రవియున్ నీరు సమస్తజీవులును నీ రాగ ప్రమేయంబుచే
నవు కార్యంబులఁ జూచుచుందు రవి యన్యాయంబులే యైనచో
భవితవ్యంబున నీకుఁ గష్టములు సంప్రాప్తింపఁగాఁజేతు రీ
వివరంబున్ దృణలీలఁ ద్రోయకుము సాధ్వీలీల లెక్కింపుమా! 104

ఉ॥ సచ్చుఁ దనంపువానిగఁ బ్రసంగములో ధవుఁ గూర్చియంటివే!
మెచ్చఁగఁ దగ్గమాటలోకొ! మేదిని నవ్వి? నిజంబు నీవు నా
కిచ్చెద నన్న సౌఖ్యములనెల్లఁ బ్రియంబున భర్తకిమ్ము నిన్
మెచ్చెద రెల్లవారు మదిమెచ్చెద నేనును మెచ్చు నాతఁడున్, 105

శా॥ ఎన్నోపున్నెములన్ లభించినదిసూ! యీ జన్మ మత్యంతమై
బన్నంబుల్ పయిఁబడ్డఁగాని మదిలోఁ బాప ప్రధానంబులై
చెన్నున్ గ్రుంగఁగఁ జేయునట్టి పనులన్ జేయంగ నూహింపరా
దెన్నన్ ధర్మపథ ప్రధాన విధులందే తేలుటల్ న్యాయమౌ. 106

ఉ॥ వద్దిటు నన్నుగోరుట, ప్రవృత్తులుమమ్మ! మహానుభావులౌ
బుద్ధులు మెచ్చునట్లదియ మోక్షముఁగూర్చును. నీ యసహ్యపుం
బద్ధతిలో లభించెడి యపప్రథముందు తరాల వారికిన్
సిద్ధిల నీయదాత్మ సుఖసిద్ధి, బలంబును, గౌరవస్థితిన్. 107

చ॥ కలిగినదాన దృష్టిపడి కాలముఁ బుచ్చుట, యన్యసంపదల్
వలచి తపింప కుండుట, ధ్రువంబగు లీల దయార్ద్రచిత్తులై
మెలఁగుట, మానవాళికిల మేలొనగూర్చెడి దైవభావముల్
తెలియుము తల్లి! యీ త్రిగుణతేజమనన్య సుఖంబొసంగెడిన్. 108

మ॥ తలఁపన్దైవ విధంబు చిత్రమతివా! ధాత్రిస్థలిన్ జీవులన్
గలిపించున్ బలురీతులన్ జొనిపి తాఁగన్నారఁ జూచున్సతం
బెలమిన్దన్నెఱుఁగంగ నెవ్వరెదలందీక్షింతురోవారికై
మలమూత్రంబుల కుండలోఁబొదిగెధర్మంబన్న సద్భావమున్ 109

తే॥ ధర్మ మేదై వరూపంబు మర్మరహితు
లిద్దిగు ర్తించి చరియించి యింగితజ్ఞు
లగుదురట్టివారికి మోక్షంబు నర్మిలినిడు
దైవ, మీవును, ధర్మంబు తలఁచుమమ్మ!" 110

సీ॥ మొద్దును బెండ్లాడి ధువిని సత్కవిఁజేసి
మోదమొందినదొక్క ముదిత తొల్లి
సత్యంబునమ్మి కష్టంబునొందెడిభర్త
బాధఁదీర్చినదొక్క భామచెలఁగి
ధీరయై యమునితోఁబోరాడి తనభర్త
జీవముల్‌రక్షించె స్త్రీయొకర్తు
సూర్యప్రకాశంబు క్షోణిఁబర్వగనీక
పతికై శపించె సుమతికలంగి

తే॥ పతుల బొఱపాట్లు దిద్దిన సతులెసతులు
వారి కనుదమ్ములన్ మూసి వక్రగతులఁ
బోవు స్త్రీజన్మమునకెద్దు పుణ్యగతులు
రావుభువి మెచ్చరెవ్వరు రాణగదుర 111

చ॥ అనితన చిత్తవాంఛను సమగ్రగతిన్ వ్యతిరేకబుద్ధితో
వినక విమర్శచేసిన వివేకిని నాప్రతుఁగాంచి, కాంత మో
మున గడు భిన్నతల్ వొరమ మూఁకొనుదుఃఖము మ్రింగుచున్ జివు
క్కున గడిపేసికొన్నదయి కోపముతోఁ జనె లోనికుద్ధతిన్ 112

కం॥ తినుటకు బిడ్డలఁగనుటకు
మనుజులు జనియించిరనెడి మద చిత్తులకున్
వినయముతో ధర్మంబును
మనుపఁగవలెననెడి మహితచిత్తులకెనయే !" 113

తే॥ అంత దేవవ్రతుండు నిశ్చింతతోడ
నడచె నావలి యింటికి నడుగ భిక్ష
నా గృహస్థుఁడు వ్రతుఁజూచి యాదరించి
యాసనం బిడి కూర్చుండు మనియె నిట్లు. 144

చ॥ అడిగెద నొక్కమాట మదినాగ్రహ మొందెదవేమొ మొన్న యీ
పుడ మి విభుండు నీ పలుకుఁబొత్తిగ నొప్పక గెంటెనంటగా!
గడుసుఁ దనంబుఁజూపె నిను కష్టము పాలొనరించె నక్కటా!
యిడుమలు పొందుచుంటి, విటు లెన్నిదినంబులు వృత్తివీగతిన్? 145

చ॥ కరుణ దలిర్పఁగాఁ బ్రజలఁగాచు విధంబొక యింతయేని యీ
నరపతులందుఁ గన్పడదు నవ్వుచు వాతలఁబెట్టు దుష్క్రియా
సరణి నెఱింగి నార, లది సజ్జనులందును జేయసాగి, రా
దురితుల పాపవర్తనము ద్రుంగఁగ నెప్పటికానొ భూస్థలిన్. 116

ఉ॥ మీరు కవీశ్వరుల్ గద! క్షమించుచు రాజుల స్తోత్రపాఠముల్
నేరుపు మీర వ్రాయుఁబయి నేర్తురుగాని, రపంతె మాశ్రమ
స్ఫారితశక్తిచే నొదవు సంపదలన్ దెకతేరగాఁ దినన్
గోరెడి భూవరాళివగు క్రూరతలెత్తి వచింప రైతిరే! 117

ఉ॥ చాకిరిచేసి పొట్టకును జాలియుఁ జాలని గంజి నీళ్ళతో
నాకలిదీర కేడ్చెడి శ్రమాధికులార్తిఁ దపించు శ్రామికుల్
మీ కగు పించరా! పరఁగ మీదు కవిత్త్వము వారి కష్టముల్
చేకొని చక్కఁగాఁ దెలియఁ జేసి జగస్థితి మార్చుటొప్పదే? 118

ఉ॥ కష్టముసేయు నొక్కఁడు సుఖంబుగ నొక్కఁడు పొట్టనింపు నీ
నిష్ఠుర దుర్వ్యవస్థ ధరణిన్ గలిపించిన పెద్ద యెవ్వఁడో
పుష్టి రవంతె కన్పడదు పుణ్య విధంబున కిట్టి సంఘమున్
నష్టముఁ జేయు పద్ధతిని నవ్య కవిత్త్వము వ్రాయఁగాదొకో. 149

వ. అట్టి కవిత్త్వంబును నీవు వ్రాసితివేని, 120

ఉ॥ ఎట్టి కొఱంతయున్ గలుగ నీయక గౌరవలీల నెప్డు ని
కెట్టి విపత్తు వచ్చినను నేము నిలంబడి రక్షసేతుమీ
పట్టెడి భిక్షకై పరుల పంచలు గాసెడి కష్టమేల? ని
కిట్టి కవిత్త్వ ముండియును నేలిద మొందుటలేల నల్వురన్? 121

మ॥ అనినన్ వానిని జూచి యా వ్రతుఁడు సత్యంబన్న యట్లుండు నీ
వినఁగాఁ బల్కిన యీ విధం, బయిన నా విన్పించు తీరున్ మనం
బున శ్రద్ధన్ వహియించివిన్ము జగతిన్ బుట్టొందుజీవుల్ సదా
గనుపించున్ బలుకష్టముల్ పడుచు లోకంబందు నున్నట్లుగన్ 122

ఉ॥ కష్ట సుఖంబులన్నవి జగంబున నెప్పుడు లేనెలేవు సం
తుష్టి మనంబునన్ గలుగ ద్రోహపుఁ జింతనలేక యుండుటల్
పుష్టి నొసంగుచుండు మదిఁ బున్నెపుఁ గార్యము లాచరింపఁ, ద
న్నష్టమె కష్టమౌ నరుల తత్త్వముఁబట్టి లభించు నవ్వియున్. 123

తే॥ గంజి నీళ్ళకు లేకేడ్చు గౌరి యొకతె
తిన్న దరుగక యేడ్చు భూదేవి యొకతె
యిర్వురిది గూడ కష్టమే యీక్షసేయ
నెవరి కష్టంబుఁ గూర్చి వ్రాయింపఁ గలవు ? 124

తే॥ కష్టమనునది భ్రమచేతఁ గలుగునట్టి
దురితభావము, సుఖమును నరయనంతె
యీ ద్వయంబును మఱపించు నింగితంబు
కలదు దానినె ధర్మ మంచిలను-నమ్ము. 125

కం॥ కర్తవ్యాంశములను మది
గుర్తించి నిరంతరమ్ము కుచ్చిత మెడయన్
వర్తింపఁ జూచుటే సమ
వర్తన మయ్యదియె దర్మ భావము జనుఁడా ! 126

చ॥ వసుధ జనించినట్టి సమవర్తికిఁ గష్ట సుఖాల నిర్ణయం
బసలు మనంబుకంటదొక హాని యొనర్పనిరీతి యోచనల్
మెసలగ నాదు దేశమను మేల్మితలంపున గష్టమైనసున్
దసలక చేయు, వానికెద ధర్మమె తోఁచును, వాఁడెధన్యుఁడౌ 127

మ॥ ఒక కాలంబున జెట్లు మోడులగు; నా యుర్వీజముల్ పల్లవిం
చొక కాలంబున, సృష్టిలోఁ గలుగు నీయున్కి-న్ మరల్పంగ నే
రికి సాధ్యంబగుఁ ? గాలమున్ దెలిసి గర్వింపంగఁ బోకాత్మలో
సకలం బాపరమాత్మపై నునుచుచో సర్వంబు సిద్ధించెడిన్. 128

ఉ॥ కావున మాదృకైత కలకాలము నిల్చెడి ధర్మమార్గమున్
జీవికి నంతఁ దెల్పునటు చేయుట న్యాయముగాని భేదదు
ర్భావము గల్గు పోకడల వ్రాసి జనంబున బోరుఁగూర్చుటల్
జీవ హితంబుగా దదియె జీవవినాశ కవిత్వమాధరన్. 129

ఉ॥ భూవలయాన గష్టములు మూఁగుచు వచ్చుచు నున్నఁగాని, దు
ర్భావములన్ దలంపక కరంబు నెవండెద నిబ్బరంబుగాఁ
బోవఁగ నిచ్చునో యతఁడె పుణ్యుఁడు, నట్టిదె మాన్యులొప్పనౌ
జీవితమన్న. నీనిపుడు చెప్పినచొప్పు విధంబెగాదిలన్. 130

ఉ॥ కాలము మంచి చెడ్డలకుఁ గారణమై నడయాడుచుండఁ దా
త్కాలిక కష్ట సౌఖ్యముల తార్పును బట్టి పరిష్కరించు నం
చేలిదపుం గవిత్వమును నేర్పడ వ్రాయుట పాడియెట్లగున్?
మేలగు ధర్మమార్గమును మేదిని నిల్ప లిఖింత్రు మాదృశుల్. 131

తే॥ ఋతుక్రమంబున నొప్పు ప్రకృతి విధాన
మానవుల జీవనస్థితి మసలుచుండుఁ
దనదు పాత్రను బట్టి కర్తవ్య మెఱిఁగి
సత్యముగఁ జరించుటయె మోక్షంబు సతము, 133

చ॥ కృతిని బఠించు పాఠకుఁడు తృప్తిమెయిన్ సకలజ్ఞచిత్తమం
దతుకు కొనంగ వ్రాయుట మహాకవి లక్షణ, మన్యమార్గమం
దతుకు కొనంగ వ్రాయుట మహాఘమునన్ జరియింపఁ దెల్పుటల్,
క్షితిపయి నీవిభేదమునుజెంది కవిత్వములుండు నారయన్. 133

తే॥ నీవు కోరిన కైత సంధించుమదిని
భీకరావేశమును, దాని వీఁక నరుఁడు
కఠిన చిత్తుండుగాఁ మారుఁ, గాంచలేడు
నిశ్చలంబగు యోచనా నియమశక్తి 134

కం॥ ఆలోచన శూన్యునిచే
నీ లోకమునందు మంచి యేర్పడఁ గలదా?
కాలుష్యమౌ వ్యవస్థను
మేలని తలపోయుఁ డనుచు మీరి పలికెడిన్. 135

ఉ॥ కావున యోచనా పరిమగల్గిన వాడొనరించు శాంతి స
ద్భావ జగస్థితిన్, వినుము తద్వ్యతిరేకి భయంకరావనిన్
గేవలసృష్టిఁ జేయు నది క్లిష్టదశన్ సమకూర్చు వానికే
త్రోవలభింప, దావలిగతుల్ దురవస్థల పూరితంబులున్ 136

వ, అని పచించిన విని తద్గృహస్థుం డెలమి నా వ్రతు నాదరించి
యింత సత్యంబుఁ బల్కితేను కృతార్థుండ నైతినని తృప్తి
గల్గునట్లు ధాన్యంబిడి పంచె, నాఁడట్లు భిక్ష లభించిననేమి యా
మరునాఁడు తగిన భిక్ష లభింపదయ్యె. అట్లనేక దినంబులు
భిక్షయును సరిగ లభింపక యింటఁ గొఱంత యేర్పడె
నవ్విధంబున. 137

తే॥ ఊరఁ బెట్టనిబాధ యింటోర్పు లేని
యింతిసేసెడి గోల యాయింగితజ్ఞు

నట్టిటుల్  సేయుచుండెడి వైనగాని
యుస్సురని నిరసించఁడు, కస్సుమనఁడు 138

తే॥ అవని విభుని కొలువు నందలి పండితుల్
వాని కెదురు వచ్చి పలుకరింప
రే విపత్తు వచ్చునేమో యటంచును
ప్రభుని దలఁచి లోన భయము మెదల, 139



# దై వ లీ ల

## ద్వి తీ యా శ్వా స ము

కం॥ ఆవిధి దేవవ్రతుఁడున్
జీవిత లక్ష్యంబుఁ గడుపు శీలము భంగిన్
భూవరుఁ డెఱిఁగి సభాస్థలి
నేవురు పండితుల మ్రోల నిట్లనెఁ గ్రమతన్. 140

సీ॥ కంటిరే వ్రతుఁ డెన్ని కష్టముల్ మూఁకొన
భిక్షాటనంబు గావించు నగరి
దేశ నాథుల నంత తేలికగాఁ జేసి
పలికి నందుల కిట్లు బాధలొందవె
నను నమ్మి విజయుండు తనరు సుఖంబుల
నంతెగాక జగంబు నలరుదాఁక
నింత ధనాఢ్యుండె యాచింప లేడను
భావంబు గలిగించు పద్ధతిగను

తే॥ భాగ్యవంతుని జేసెద యోగ్యులెల్ల
నాయుదారతఁ గొనియాడ నాదరించి
రేపు*సంక్రాంతి నాఁటికే ప్రాపుమీర
బావురు మటంచు నేడ్వ దేవవ్రతుండు 141

ఉ॥ ఆవిధినాడి యోలగమునందు నెపంగెడి దత్తు నర్మిలన్
భావమెసంగఁ బిల్చి, విను! భాగ్యమునిచ్చు బహూకృతిన్ ద్వదీ
యావసథంబు సంతసమునందు నటుల్ సలుపంగ నెంచితిన్
గావున మమ్ముఁగూర్చి తగుకావ్యము వ్రాయుము సత్కవీశ్వరా! 142

ఉ॥ నీకిడు కానుకన్ గని జనించిన భేదమునన్ వ్రతుండు ము
న్నికడఁ దానొనర్చినది యింపిత మింతయుఁగాని దంచులోఁ
టీఁకు వహించివచ్చినను శీఘ్రగతిన్ క్షమియింపఁగోరు, నీ
లోకమునందు నీకొకఁడె లోపముగన్నడ దింక నమ్ముమా! 148

వ. అని రాజనినంతఁ బొల్లి దేవవ్రతుండు పల్కిన దైవాధీనం జగ
త్సర్వమను సూక్తిని గాదని విజయదత్తుండు రాజాధీనం జగ
త్సర్వమన్న యెడఁగాదని పలుక కుండిన పండితులకెల్ల నబ్బు
రంబై యసూయాలోలురైరి, కాని పైకిఁ దమభావంబు విజయ
దత్తునిగూర్చి యేవిధంబుగొఁ బ్రకటించుట కప్పుడు సమంజ
సంబుగామి మిన్నకుండి లోలోనిట్లు తపించిరి, 144

మ॥ అరెరే! వీనినిగూర్చి చెప్పమపుడే, అయ్యయ్యో! యీ కానుకన్
దొరయీకొంటకుఁ దగ్గశక్తి రవయున్ దోఁచంగలేనట్టి వాఁ
డరియన్ దోషముచేసినాము, వ్రతుసత్కార్థంబునుంగూర్చి వీఁ
డెఱుఁగన్ బల్కినపల్కుఁ గాదనఁగలే, కెంతయ్యొ ఘోరంబిటన్!
145

ఉ॥ ఇప్పుడు వీనిగూర్చి, మతిహీనుఁడటంచును బల్క వీలుఁగా,
దప్పుడె చెప్పరేల? యనియాగ్రహమొందును రాజు, కాన్కయా

తప్పుడు వాని కీయఁగని తద్దయు మెచ్చుటపాడిగా, దెటుల్
చొప్పునశించె నిందు, పయిఁజూతము దైవమెటుల్ విధించునోః 146

వ. అని యా పండితవర్గంబు విచారించి చేయునదిలేక నిజ నివాసం
బుల కరిగిరంత రాజిడిన వాగ్దానంబును బునః పునః స్మరించు
కొనుచు సంతసించుచు నింటికేఁగి. 147

ఉ॥ దాంతి సెలంగ నావిజయదత్తుఁడు సారసయుక్తి శోభితా
నంత మహాకళాభరిత నవ్యకృతిన్ లిఖియింపసాగె, నా
సంతసమైన వార్తనొక సంధ్యఁదటాకముచెంతఁ జెప్పెఁదా
నెంతయు నుబ్బి వానిసతి యెల్లఱు స్త్రీలువినన్ బ్రమోదయై. 148

వ. అట్లు కొలనుకడ విజయదత్తుని భార్య తన భర్తవ్రాయు కృతిని
గూర్చి, 149

ఉ॥ చెప్పెడివేళ నీటికయి చేరిన యమ్మలు విన్నవారాలా
చెప్పినదాని గూర్చి వినఁజెప్పిరియల్లఁ బ్రసూనకంతలో
జెప్పినతోనె విస్మయముఁ జెంది విచిత్రమునొంది పోయితాఁ
జెప్పఁ దొడంగె భర్త చెవిచెంతకుఁ జేరి దరస్మితాననై. 150

ఉ॥ వింటిరె! రాజుదత్తుని బువిన్ సరిసాటియెలేని రీతిగా
నుంటకుఁ దగ్గకానుకను నొప్పిదహాగతి నీయ నుండినా
డంబ. రచింపఁ గావ్యమును నానతి యిచ్చెనటంట, మీరునున్
గొంటకునొఁ గదాః కృతిని గూర్పఁగరాదః, బ్రబంధశైలినిన్. 151

సీ॥ మీనోటవెలువడుజ్ఞానకళికలును,
మీమాటలందున మెఱయురుచులు,
మీ వృత్తములలోని భావపరిమళంబును
మీ మృదుశైలి సంప్రీతి కరము
మీరు సూచించెడి మెలకువల్, మీరిచ్చు
నుపమానములలోని యొప్పిదములు,
ఒరుల కబ్బునటన్న నొప్పదునామది,
చేయరటన్నదే చింతతప్ప,

తే॥ ప్రభుని బొగడుచు మెచ్చుచుఁ బద్మనాభు
తో సమానునిగాఁజేసి, భాసమాన
మకుట భాషాప్రసంతిని మలచియొక్క-
కావ్యమును వ్రాయనేర్చిన గాదెమేలు! 152

చ॥ అనిన సతీమణిన్ గని ముదాయతలోచనుఁడై, "తలోదరీ!
ధనమన నెంతయాసయె? విధంబొక యింతయెగానితీరునన్
ధనమునుగొంట కొప్పునెడధాత్రిపయిన్ గవితామతల్లికిన్
బనపడునేయశంబు, క్రమభంగమునొందవె నీతి, ధర్మముల్! 153

సీ॥ క్షణములోఁ గావ్యలక్షణముగ్రహింపఁగఁ
గలమేటికిచ్చిన గలుగుయశము
ఒక మాటలో బీదనోమగాఁదలపోయు
పుణ్యునకిడఁ గృతిభూమినొప్పు
సత్యమసత్యంబుఁ సవ్యంబుగానెంచు
తపసికిచ్చినకృతి తనరుజగతి

దానధర్మంబుల దాఁగకసేయు ను
దారునకిడఁగృతి ధరణి నొప్పు.

తే॥ ఋతువునెఱిఁగిన కృషికుండు నతులపుణ్యుఁ
డాత్మనాథుని సేవించుఅతివమిన్న
సత్యమెఱిఁగిన ధన్యుఁడేక్ష్మవిభుండు
ఇట్టి పుణ్యులకిడిన గృతీంద్రిమొప్పు. 154

తే॥ సత్యమునెఱుంగఁదెలియక సభనునన్ను
మూరిపొమ్మనె నారాజు తొందఱించి
శాంతమేలేనివారికిఁ జక్కనికృతి
వ్రాసి యంకితమిచ్చుట దోసముగద ! 155

ఉ॥ నమ్మితి నామనంబున ఘనంబుగదైవమునే, ధరిత్రిఁ దా
నెమ్మెయిఁజేయునోయటులనే భరియించెద లాభనష్టముల్,
సొమ్మునకాసఁజెంది పరిశుద్ధత వాయనునాత్మలో? నిజం
బిమ్మనుగూర్చుదైవమొకయింతక్షమన్ గొనియున్ననేరినే, 156

చ॥ అనినుడువన్ బతిన్ బెరిమనారయ కాలలితాంగి విస్వనన్
జనినదినాఁడు, నాపిదప సంక్రమణంబున భోగి వచ్చెనా
దినమునదత్తుఁ "డర్సు" కథ దీపిలవ్రాసిన కబ్బమున్ సభన్
వినిచె సెభాసటంచుఁ గలవేత్తలు మెచ్చగ రాజుపొంగఁగా, 157

ఉ॥ పెండియు నాధరాధిపుడు వేడుకదత్తున కీయనెంచిలో
నుండినకోర్కె చొప్పున సమున్నతమౌ శుభదాయకమ్ముసీ

వుండినదాఁకవియ్యది సముజ్జ్వలతన్ నెగడొందుమంచుఁ గూ
ష్మాండము నొక్కటిచ్చె సభమౌనముమైఁ గనుచుండనర్మిలిన్, 158

ఉ॥ ఇచ్చినదానిగాంచి బుధులెల్లఱు లోపలనవ్వికొంచు, నీ
పిచ్చికిఁ దగ్గదే కుదిరెఁ బృథ్వివిభుండెదొ ముల్లెనిచ్చు నం
దెచ్చిన మక్కువన్ గృతిని నింతగ వ్రాసితె!" యంచుహేళనల్
స్వచ్ఛముగాఁ దలిర్పఁగ నుపర్చిరిమోముల నాసభాస్థలిన్, 159

తే॥ అదిగ్రహింపఁడు రాజు తానరసెదత్తు
చేయునదిలేక ఫలమును చేతఁబట్టి
యెఱువుఁదెచ్చిన సంతోషమెలయుభంగి
మోమును వివర్ణరేఖలు మ్రుచ్చిలింప, 160

వ॥ తానా కూష్మాండమునుగొని యెదుటి వారల కుదుపుఁజూపుల భరింప లేక సెలవని రాజుతోనని దత్తుండింటి దారిఁబట్టి పోవుచు నాత్మగతంబున రాజొసంగిన కానుకను జూచుకొని వికటగతి నవ్వికొని యిట్లనికొనె, 161

ఉ॥ కీడులొనర్చురాజులను కీరితిపై నుతియించి చెప్పితిన్
నాఁడు, వ్రతుండు చెప్పినదిన్యాయమె యైననుగాదటంచు, నే
నాడినదానికీధరణినాథుఁ డొసంగినదాని కొప్పె, నీ
బూడిద గుమ్మడిన్ గొని ప్రభుండిడి నాడని యింటనీయనా! 162

వ॥ అని తానొనర్చిన పొల్లునకుఁబొల్లు మాత్రమే లభించెనని చింతించుచు దారినేఁగుతఱి నత్యంతాసక్తిమెయి నొక్కవర్తకుండెదురై. దత్తుని చేతనున్న కూష్మాండమునుగని అయ్యా! నేనీదినంబున దైవంబు

నకు వేల్పుడుగావింప నొక్కసుమము నేనియు నింట భద్రపఱచ
నైతి, కారణంబునేఁడు భోగియగుట మిక్కిలి బేరంబగుడు మఱ
చితి, మీకడసుమబొండె ఫలంబొండెన్ని యున్ననిత్తురే॰ యనిన
దత్తుండిట్లయె, 163

ఆ॥ దైవభక్తిఁ దనరు భావంబుగల నీవు
వీడు మదినిచింత, వేడ్కఁ గొనఁగ
నెంతువేని నాదుచెంతఁ గూష్మాండంబు
గలదు తగిన వెలకుఁ గరముగొనుము. 164

మ॥ అనినన్ మోదమునొంది యట్లెయిడుఁ డయ్యా? యంచు
వైశ్యుండుఁ దాఁ
గొనియెన్ దత్ఫలమర్ధినిన్ బిదప సంకోచంబు లేకుండ ని
చ్చెను దీనారము లైదు, చూడ నితఁడే శ్రేష్టుండు ధాత్రీశుఁడి
చ్చిన యల్పంబునుగొప్పసేసెనని యెంచెన్ దత్తుఁడున్ లోపలన్,165

వ, అట్లెంచి వైశ్యునంపి, 166

తే॥ చక్క నింటికిఁ బోయె విచారముడిఁగి
రేపు సన్మానమగునని ప్రాపుమీర
నడిగిన సతీమణికిఁ జెప్పె నుడిగియొగ్గు
"ఆత్మవంచకు నడవడి యడుగవలెన?" 167

వ, దత్తుని వృత్తాంత బిట్లుండ, వైశ్యుండా కూష్మాండమును గొని
పోయి దైవపూజఁ గావించి యా దినంబ యేరికేని దానంబుఁ
గావింపనెంచి దారిఁ గాచియుండె. అట్టి యెడ 168

సీ॥ బ్రహ్మతేజస్ఫూర్తి భాసిల్లు మోమున
వినయ విధేయతల్ వెలయుచుండ
వెడఁద యురమునొంపు నడరునెమ్మనమున
సువిశాల భావ విస్ఫురణమొప్పఁ
బరఁగెడి నాజానుబాహుత్వమున దయా
రస విహారము దనరారుచుండ
నిడివియై పసిడికే నిగ్గుఁ గగ్గించెడి
నిలువు చెలువంబొగి నెగడుచుండ

తే॥ మంద గమనంబు తనకొక యందమీయ
గుమ్మముల నిల్చి బిచ్చమ్ముఁ గోరికొనుచు
భక్తిఁ బరమేశు ధ్యానించు భావమెలయ
వచ్చు దేవవ్రతుఁడు గానవచ్చె నంత, 169

కం॥ దానం బీయఁగఁ దగు స
న్మానితుఁ డితఁడంచు సెట్టి మనసు గరుగ. నో
మానిత హృదయా! ర''మ్మని
తానాకూష్మాండమొసఁగెఁ దద్దయుఁ బ్రీతిన్ 170

వ॥ అట్లొసంగిన తత్ఫలంబును పరమేశ్వరార్పితంబుగాఁగొని బిచ్చను
మెచ్చుచు దీవించి క్రమత నింటికిఁజని భార్యకా భిక్షంబిడిస్నానంబు
నకుఁ బెరటిలోని భావికడకుఁజనియె. అంత ప్రసూనయు నా
భిక్షంబునరసి పండుగనాఁడును సరియైన తిండిలభింపనందుకుఁ
గినిసియెదుటఁ గన్పించు కూష్మాండంబును గ్రూరదృక్కుల
నరసిచేతఁగొని పిచ్చితనంబెలయఁబృధ్వికి విసరె, 171

కం॥ విసరిన గూష్మాండంబున
బిసఁగొనియున్నట్టి ధనము బిరబిర నింటన్
ముసురుకొనె నామెహృదయము
వెసనబ్బురమొందఁగనులు విభ్రమనొందన్. 172

కం॥ కలయా! నిజమా! యని యా
నెలఁతామణి తవిదె నొకట నిలువునునెల్లన్
దలఁచెను నిజమేయని ని
శ్చలయై నిలచెన్ రవంతశాంతినెలకొనన్ 173

కం॥ చూడకచూడక కలిమిన్
నాఁడే చూచినదియౌట నాశములదరెన్
గూడుకొనె మరల నంతటఁ
బోడిమి దనయత్తఁ బిలువఁ బోయెఁ బెరటికిన్, 174

తే॥ పోయిగుట్టుగ నింటిలోఁ బ్రోవుపడిన
ధనము గూర్చివచించె సంతసము మెఱయ
నత్తయున్ బర్వులెత్తుచు నచటి కరిగి
చూచి విభ్రాంతచిత్తయై సోలిపడియె. 175

తే॥ అత్త స్థితిఁగని భయపడి యాత్మనాధు
కడకుఁ జనితెల్పె గుమ్మడికాయలోని
ధనము సంగతి, యత్త చిత్తము దొఱంగి
పడిన సంగతిఁ, గాని యా పండితుండు. 176

కం॥ నెమ్మదిగ స్నానమును దా
నిమ్ముగ నొనరించి వచ్చె నింటిని జూడన్
దిమ్మరిలి పడిన తల్లియు
దమ్మున్ గొనిలేచెఁ జూచెఁ దనయుని నప్పుడే. 177

ఉ॥ చూచి ససంభ్ర చిత్తయయి సూనృతవాదివిరాసుతా! ధరన్
నీ చరితంబు మాయకయె నిల్చునురా, నృపునే జయించె నీ
శౌచము, దైవమేయిటుల సంపద నీ కొసఁగెన్ నిజంబురా!
రాచటికంబిడన్ గలుగు "రై"సమమౌనొకొ! దీని ముందరన్? 178

కం॥ బదవలు పడినను దైవము
ముదమును సమకూర్చెఁ గడకు ముద్దుల తండ్రీ!
హృదయము గలవాఁడవు నిన్
సదయత హరి గావకున్నె క్ష్మాతలినెసఁగన్? 179

తే॥ అని కుమారుని మెచ్చుచు నవని జెదరి
పడిన ధనమును ట్రోవుగా వడిగఁ ద్రోసి
భద్రపఱచెను పేటిక భావమలరఁ
గోడలున్ దోడుగా నెంతొ వేడుకొదవ, 180

చ॥ తన యవివేకమున్ దలఁచి తద్దయునింద యొనర్చుకొంచు, నా
వనిత ప్రసూన భర్తృపదపంకజముల్ మనసార నంటి నన్
గనుఁడు దయన్. క్షమింపుఁడని కన్నుల నీరిడిపల్కె నావ్రతుం
డనుపమ సద్దయా హృదయుఁడై సతి యూరడిలంగ నిట్లనుఁ. 181

ఉ॥ చెప్పనెమున్ను దైవమును జిత్తము నన్నెఱనమ్మి నట్టివాఁ
డెప్పకైన ధన్యుఁడగు డెంతయు సత్యమటంచు, దీని నీ
విప్పటికైన నమ్మితివనియేని నిజంబుగ ధన్యవౌదు. నీ
చొప్పున దైవనిర్ణయము శోభిలుచుండు ధరిత్రిఁ బ్రేయసీ. 182

వ. అని చిఱునవ్వు నవ్వి పలికిన భర్తనుగని ప్రసూన యిట్లనియె. 183

చ॥ తెలియక మీ మహాత్తర హృదిన్ దెగనాడితి, దోషినైతి, నా
కలుషమునైపరే యనుచుఁ గాళ్ళపయింబడు భార్యనర్థిఁ దా
నలరఁగ జేతులన్ బడసి యౌనె యిటుల్ వగవన్. మహాత్ములే
తెలియఁగలెరు దైవము విధించెడి దేమొరవంతముందుగా. 184

ఆ॥ అనుచు నూరడిల్లు మనుచు నోదార్చిన
వగపుమాని భార్య నగుచు నిలచె
మాట వేడ్కనొందె మహితమౌ వేడ్కల
నిల్లు శోభనొందెఁ బెల్లుగాను. 185

కం॥ దైవాధీనమె జగమను
భావంబును నిజమటంచు భావించిరి వా
రావిధి ధనమబ్బుటచే.
భూవరుఁడా దినము గడచిపోయిన పిదపన్. 186

వ. విజయదత్తుండు సభకు రానరపి తోడిపండితులు విననిట్లడిగె, 187

తే॥ విజయదత్తా! నిజంబు నీ విమలతత్త్వ
మెఱిఁగి కూష్మాండ మిచ్చితి నెలమితొడ
ధనము నింపితి నెంతయో దానియందు
జూచి యుందువు చెప్పుమా శోభితనర? 188

అనినతోనె దత్తు కవిసెను గుండెలు
వేదనంబు మదిని విస్తరించెఁ
జెప్పఁదోఁచ కేమి చిత్తంబు వడఁకఁగా
బొమ్మ పగిది నిలచెఁ బుధమిపైన. 189

అట్లు నిలచి యేమియు సమాధాన మిడని దత్తుని మరల
రాజిట్లడిగె. 190

నీ కిడిన ఫలము నింటికిఁ
గైకొని పోయితివ? దాని ఖండించితివే।
చేకూర సుఖము భవద్గృహ
మేకోన్ముఖమై సెలంగ నిచ్చితి ధనమున్. 191

రాజాధీనము జగమను
నోజన్ నెఱనమ్మి నందు కుద్ధరణంబున్
నేఁజేయ నెంచితిన్ వ్రతు
తేజంబుడుగన్ భవద్విధిన్ బెంపంగన్. 192

అని యడుగ నందులకును సమాధాన మిడక యేదియో
తెలియక తప్పుచేసినవాని చందంబున శిరంబును నేలకు
వాల్చి నిలచియున్న దత్తుని మరల నిట్లు రు నడిగె. 193

అలఁతి కూష్మాండమని యేరికైనగాని
యమ్మితివొ లేక వంటకై యాలికిడితొ
చెప్పుమనుచు గద్దింపఁగాఁ జిత్తములికి
పాటునొంద దత్తుండు దిగ్భ్రాంతినొంది. 194

తే॥ ఎంతపని యయ్యెనయ్యో! రవంతయేని
నమ్మకము లేనిమాటను నమ్మినట్టి
ధ్యేయమటులాడి సువ్రతు మాయఁ జేసి
నాడ, నందులకుందగు కీడెయయ్యె. 195

ఉ॥ చేతికిఁ జిక్కినట్టి సిరి చిత్రముగా నెడమయ్యె, నక్కటా!
క్ష్మాతలినింతకన్నఁ గన సత్యమదేమి! మనస్సులోన నే
నేతటి దైవమున్‌గొలుతు, నీర్ష్య వ్రతున్ బరితప్తుఁ జేయ నా
రీతి నసత్యమాడితిని పృథ్వి విభుండలరన్ మదంబునన్. 196

చ॥ నరపతి భక్తియున్నటు మనంబు వెలార్చితి, నట్టులైననున్
నరపతి నమ్మనైతిని ధనంబు తరంబులు సౌఖ్యమొందు న
ట్లరుసు లభింపఁ జేసినను నందదు నా కహహా! విచిత్రమీ
తెఱఁగు వినన్ వ్రతుండె నిజదీప్తి వెలింగిన ధన్యుఁడారయన్. 197

వ. అని విచారించి తన తప్పిదంబును నొప్పుకొనక దబ్బరలాడి
నచో నిహపరంబులకుఁ జెడుదునని చేసిన దోసంబు నింతకుఁ
జేసితి నిఁకనైనను జేయకుందు, యథార్థంబు నుడివెదనని
రాజు నరసి యిట్లనియె, 198

కం॥ భూమీశా! మీరిడినది
సామాన్య ఫలంబటంచు నరకేసేయన్
గోమటి కొక్కని కమ్మితి
గామించితి నల్పధనముఁ గరుణను గనుఁడీ! 199

వ. అనినంత నరపతి మతి చెదరె. సభ్యులెల్లఱును విస్మయా
నందము నొందిరి. అంత రాజు దత్తు నరసి యిట్లనియె. 200

తే॥ ఎంతపనిసేసినావు నిన్నెంతగానొ
బాగుపఱచఁ దలంచినే భాగ్యమిడితి
వ్యర్థమొనరించి నావె నాయర్థమెల్ల
నన్ను నిజముగ మదిఁనీవు నమ్మినావె?

వ॥ అనియడిగిన నేమియుఁ బలుకకున్న దత్తుని యాత్మవంచకుఁ
గా నెఱింగి. యింతకావైశ్యుండెవ్వఁడని యడిగివాని వలన
నెఱింగి భటులనంపి సభకురావించి కూష్మాండవృత్తాంబునడిగిన
నాసెట్టి యిట్లనియె, 202

కం॥ కొనినాడ నాఫలంబును
దనరఁగ నైవేద్యమిడితి దైవంబునకున్
ఘనమని దానంబిచ్చితి
ననఘుఁడు దేవవ్రతుండు నట నగుపింపన్ 203

మ॥ అనిన్ రాజుశిరంబు ద్రిమ్మరిలె నాహా! యంచు నాయోలగం
బున నున్నట్టి బుధుల్ విచిత్రగతి వంపుల్ వోయి నా రెంతయో
మన మారాటము నొందె దత్తునకు, సంభావించెలోలోన నా
జననాధుండు వ్రతున్, దలంచె విజయున్ సంస్కార
హీనుంబలెన్ 264

వ॥ అట్లు తలంచి విజయదత్తుని గాంచి 205

ఉ॥ నమ్మవునీవునన్ను మదినమ్మియెయుండిన వాఁడవైనచో
నమ్మెదవేఫలంబు! నకటా! పొఱపాటొనరించితిన్ నినున్
నెమ్మినిజూచి వానినొక నీచపుదృష్టిని జూచితిన్ నిజం
బమ్మహితాత్ముఁడాడినదె యైనది దైవమెపంపె వానికిన్ 206

చ॥ గెలిచెవ్రతుండు, నోడితిమి కేవల మీవువచించినట్టిదే
యిలపయి సత్యమంచుమది నింతగనమ్మిన మేమునీవు, నీ
కలుషము సైపరానిదిఁకఁగన్పడఁ బోకుము నా సదస్సునన్
దొలఁగుము నిన్నుజూచుటకుఁదోఁచుటలేదు ముదంబెనామదిన్ 207

వ॥ అని నరపాలుండు విసువున బలికినంత దత్తుండు సేయునది
లేక చేతులు జోడించి యా కొలువున నొకమూల నొదిగినిలచె.
అంత నెల్లపండితుల సమ్మతిమెయిఱేఁడు నొక్కరమణీయపల్యం
కంబుతోసేనాపతినంపి గౌరవపురస్సరముగా దేవవ్రతుని సభకు
రావించి కూష్మాండమును గూర్చియడుగ వ్రతుండిట్లనియె. 208

మ॥ నరనాథా! పరమేశు సత్కృపను దానస్ఫూర్తిగూష్మాండ మా
వరభక్తుండడె దానినాసతికిడన్ భాగ్యంబు వెల్వడ్డదా
సిరినిన్‌జూచి మదీయ చిత్తమును హర్షించెన్ ధరిత్రిన్ బరా
త్పరు లీలల్ కనశక్యమే?, యెవరికే తాత్పర్యముల్
గూర్చునో 209

వ॥ అని పలికినరాజు దేవవ్రతుని యాత్మవిశ్వాసమున కబ్బురం
బొందియిట్లనియె, 210

మ॥ భళి! దేవవ్రత! చిత్తశుద్ధిగల సద్భక్తుండ వీ వారయన్
బలుకన్గల్గితి వాక్కు సత్యమును సంభావించి యద్దానినే
తలయందుంచి జయించినావు ప్రకృతిన్ దధ్యంబుగాముందునీ
యలఘుప్రాభవలీలనే నెఱుఁగనే యజ్ఞానినై మాన్యుఁడా! 211

మ॥ ననుమన్నింపుము నీకు గౌరవము విన్నాణంపు దృష్టిన్ బురిన్
జనులీయందగు పద్ధతిన్ జెఱచితిన్ సత్యంబుగా నెంతగాఁ
గనలంగల్గెనొ స్త్రీమనంబు: సతియున్ గాఠిన్యలీలన్ సదా
నిను వేధించిన సంగతిన్ దెలిసితిన్ నేరంబునేఁజేసితిన్ 212

వ. అనిన రాజును గని దేవవ్రతుం డిట్లనియె, 213

శా॥ ఏలా మీరెవఁగుందుటల్ జనవరా? యెంతేని నాకీ యెడన్
మేలేచేసితి రీరిదెట్లనినన్ మీరావిధిన్ జుల్కునన్
మేలంబాదరయేని నామనమిటుల్ మేలైన సత్యస్ఫుర
చ్ఛీలంబున్ గొనిదెవ సత్కృప విరాజిల్లన్ బ్రవర్తించునే? 214

వ॥ అనిన నమ్మహాకవి సమయోచిత సంభాషణంబున కబ్బురం
బొంది సింహాసనంబు డిగ్గి దేవవ్రతుని సమీపించి 215

కం॥ అన్నా! దేవవ్రత! నన్
మన్నింపుము, బోధసేయు మంచితమార్గం
బన్నునసేమో, ప్రజలకు
విన్నాణం బుదయమొందు విధమదియేమో?" 216

వ॥ అనవుడు దేవవ్రతుండు భూవరున కిట్లనియె. 217

కం॥ వినుఁడో మనుజాధీశా!
మనుజుఁడు మోక్షప్రధాన మార్గస్ఫురణం
బెనయఁగ నొక్కవిధంబెదె
నెనరున నెఱనమ్మియుంట సతి యనబడున్. 218

ఉ॥ నమ్మినదానినే యడుగ నల్వురకున్ వినఁజెప్పఁ గావలెన్
సొమ్మునకాసఁజెంది నిజసూక్తిఁ దొఱంగఁగఁబల్కరాదు, స
త్యమ్మున నద్దియౌఁ బ్రగతిదానలభించు, సుఖంబుఁగల్గు, ఆ
నమ్మికలేనిచోఁగలుగు నష్టము, గౌరవహాని భూవరా! 219

ఉ॥ దేవునిపైననే మదిని దేల్చుట శ్రేయమటంచుఁగాని, యే
భూవరుపైన భక్తిమెయిఁ బుచ్చుటకూడదటంచుఁగాని, నా
భావముగాదు, నమ్మినది పాటులు పెల్లుగ వచ్చినన్ మదిన్
జేవదొఱంగ నీయక యె చేయుట లెస్స యటందు భూవరా 220

తే॥ విజయదత్తుండు మిమ్మెద విశ్వసించి
యున్నచో మీరిలిడినట్టి యుడుగరనిటు
సెట్టికమ్మనె తేలికసేసి: యట్లు
తానొనర్పనిచోఁ బొందు ధనముతానె. 221

కం॥ నరునైనను హరినైనను
నరవరునైనను నిజంబు నరుఁడొక విధమున్
బొరయఁగ నమ్మిన నదియే
సిరులిచ్చును గీర్తినిచ్చు సిద్ధము రాజా! 222

చ॥ నరులకు నాత్మశుద్ధి గలనాఁడు జగత్స్థితి దివ్యరూప వి
స్ఫురణ వెలుంగు, క్షామములు సోకవు, రోగములావరింప, వీ
వరుసను నమ్మి, యింకపయిఁ బాలనసేయుడు రాజచంద్ర! మీ
సరణిని రాజులెల్లఱుఁ బ్రశంస లొనర్తు రనేక కాలమున్, 223

ఉ॥ సారములేని మాటలకు స్థానమొసంగఁగ రాదటంచు మీ
ధారుణి నాథులుండవలె, ధర్మము పల్కుట న్యాయమంచు మా
సూరిజనుల్ తలంపవలె, క్షోణితలిన్ వెలుఁగొందు నప్పుడా
చారము నప్రమాదగతి: శాంతి, సుఖంబు సమస్తమున్ నృపా! 224

తే॥ ఆత్మ విశ్వాస మందఱ కవసరమ్ము
స్థాన మెఱిఁగి చరించుట సత్యమవని
మర్మమును వీడి మాటాడ ధర్మమరయ
భూవరా! ధాత్రిఁ బ్రగతి సొంపొందు నపుడు, 225

మ॥ అదియే నాకిపుడీ యశోధనము లభ్యంబౌనటుల్ సేసె. సం
విదులిద్దానిని నర్థి మెచ్చెదరు, పృథ్వీనాథ! దైవంబుపై
మదినే నిల్పితి దానిశక్తియిటు సంప్రాప్తింపఁగాఁ జేసెఁదా
నెదమిమ్మట్టులె నమ్ముచో, దొరకు నీ హీరమ్ము నా దత్తుకే. 226

వ. కావున, 227

కం॥ విశ్వాసమె ఘన దైవము
విశ్వాసమె సర్వశక్తి వెలయించు ధరన్
విశ్వాస హీనుఁడగు వాఁ
డీశ్వర యంశంబులేని హీనుఁడు సుమ్మా! 228

మ॥ అని దేవవ్రతుఁడాడ భూవిభుఁడు దానవ్వాని విశ్వాసమున్
ఘనలీలన్ దలపోసి యిట్లనియె, "నేఁ గాంక్షించితిన్ దత్తునిన్
ధనవంతున్ జలుపంగఁ గాని యది యాదైవంబు నీకిచ్చె, నే
మనుదున్! సత్యమె నీవు చెప్పునది దివ్యాంశ ప్రభూతాత్మకా. 229

ఉ॥ తేఁకువమాలి నిన్నుఁగడుఁ దేలిక నాడితిమున్ను. దాని నీ
వేకడ వెల్లనాడక మదీయహితంబును గోరియుండుమా
మాకడ, గౌరవస్థితిని మన్గడ సాగఁగ, నెల్లపండితుల్
నీకు విధేయులై మెలఁగ నేనును గొల్తు నవార్యలీలలన్. 230

కం॥ అనినన్ దేవవ్రతుఁడా
జనపతినిన్ జూచి పలికె క్షమయింపుడు మీ
మనమును గాదనవలసిన
పనియేర్పడి నందుకనుచుఁ బలికిన నృపుడున్. 231

ఉ॥ నాకడనుండ నొల్లవె : మనంబున చొల్లిటి భేదముండెనా ?
నీకు నిజంబు మా సభను నీవు మెలంగిన శ్రేయమంచు మా
కీ కథ తోఁచినంతఁ గలిగెన్ ముదమారఁగ నుండుమన్న! నీ
లోకనకే విపత్తు నిట లోపముగల్గదు నమ్ము మిందులన్, 232

వ. నావుడు దేవవ్రతుం డిట్లనియె. 233

ఆ॥ వలదు రాజ ! నాకు వదలిన స్థానంబు
దత్తునకె లభింపఁ దగదద్ది
వానికిడుఁడు నాదు వాంఛితం బయ్యది
దోషి గాడతండు భూషితుండె, 234

వ. ఎట్లందురేని ? 235

శా॥ తానా రీతిని నన్నెదిర్చనెడ నా తత్త్వంబు దైవంబుపై
జ్ఞానస్ఫూర్తి నిలంబడన్ జనక విజ్ఞానంబు వోనాడఁగా
నౌనేమో ?, యెఱుఁగన దరంబె ? కనుకన్ హర్షంబు నాకిట్లుగాఁ
దానే కారణమై నుతింపఁ దగు బోధస్ఫూర్తిఁ గల్గించెగా ? 236

ఉ॥ కావున వాని స్థానమును గౌరవలీల నొసంగ నాకునున్
భావము రంజిలున్, దలఁపవద్దు ననున్ వ్యతిరేకిగా భవ
ద్భావమునందు. నేనిచటఁ దద్దయు నుండుట కూడదన్ననో
ఘోర! మిథ్యఁ గాదనుట బొత్తిగఁ గాదు వినుండు మన్మతిన్. 237

ఉ॥ పోయెద జోగినై ప్రజలఁ బోడిమిఁ గూర్చెడి బోధసేయఁగా
హాయినొసంగు సత్యము రహంత నెఱింగని వారినెల్ల నా
ధ్యేయము నమ్మి కొల్చునటుఁ దేల్చెద జీవితమున్నదాఁక నీ
మాయ జగంబు నందదియె మార్గముగాఁ దలపోసితిన్ నృపా. 238

చ॥ అనవుడు వాని లీల యఖిలార్థ ఫలంబని యెంచి. క్రమ్మఱన్
వినయముతోడ దత్తునకు విశ్రుత పీఠమొసంగి, యెల్లఱున్
వినియుచు నుండఁగా ప్రభుని దత్పరతన్ నుతియించె రాజు, నా
క్షణమున దత్తుఁడున్ గదలి కౌతుకపూర ప్రభున్ సమీపమై. 239

ఉ॥ నన్ను క్షమింపు మోహితుఁడ ! నవ్యగుణాకర ! నిన్ను నొంపఁగా
భిన్నము వల్కి లేకి వడి పృథ్వినసత్యముతో లభించు నీ
బన్నము నొందినాడ, భగవంతుఁడు నీకె భటుండుగా ? నిజం
బన్ననెవో యెఱుంగఁబడు నట్లొనరించెనిటుల్ మహాసుధీ !. 240

చ॥ అనిహితమాడి పీడనృపుఁ డర్థిననుజ్ఞయిడన్ గృహంబువేఁ
జనిసతిన్ బ్రియంబలరక్ష్మ్రితలిఁ దానొనరింప నెంచిన
ట్టినియమమున్ వచించి తనటీకన వత్తునటన్న భార్యనున్
మనమున మెచ్చితీసికొని మాతకు సర్వమొసంగి జోగియై. 241

చ॥ కదలిన వానిజూచి ప్రజగౌరవమొప్పనుతించి పట్టణం
బుదరికి వీడుకొల్పి తగుదోద్ధవుగమ్మని పల్కివచ్చి, రా
యదనున నా పురంబు మఱియాదను బొందెను, శాశ్వతంబుగా
విదితగురుండునై వ్రతుఁడు విశ్రుతినొందె గురుప్రతిష్ఠితిన్. 242

ఉ॥ ఈకథవిన్న, శ్రద్ధఁ బఠియించిన, గల్గుశుభంబు, ధాత్రి సు
శ్లోకులు మెచ్చు మార్గమున శోభిలనౌ, మరియాదకెందునున్
లోకువరాదు, సత్సుఖములున్ గలుగున్, బుధలోకవర్తనన్
దేఁవసతో మెలంగనగు, దివ్యపథంబు లభించు నేరకేన్. 243

శుభం

సమాప్తము.

